# తాలుకుట్టనము

వెలూ[illegible]ము శాస్త్రి

శతావధానిచే

రచియింపఁబడి

చంద్రికా ముద్రాక్షరశాలయందు

ముద్రింపింపఁబడియె.

**1913.**

**As. 4**

రపాటను కొందమన్న మీరిపరీధావివత్సరపుఁ బత్రికలలో నెన్నిటియందో యిట్లే ప్రక
టించికొనియున్నారు. ఇది ప్రమాదమనుకొందము, తిరుపతివెంకటేశ్వరులు నాయవధా
నవిషయమై శ్రమపుచ్చుకొనుటనుగూర్చి మీరంతగా విచారించితిరేమి, గురువులు శి
ష్యులయెడల దయఁగల్గి వారిశ్రేయమునకు యత్నించుట తప్పా? కృతఘ్నుఁడనైనచో
నేనువారు శ్రమపుచ్చుకొనలేదని వ్రాయఁగలుగుదునుగాని లేనిచో నెట్లు వ్రాయఁగలను?
వారివిద్యవారిదయవలన నాయందుఁ బ్రవేశించికదా? నేనాయవధానమును జేయఁగల్గితిఁ
అట్టిచో వారు శ్రమపుచ్చుకొనిరనినఁ దప్పేమి లేదు వారేచేసినాకాయశము నిచ్చిరంద
రా? అట్లేనివారుచేసి మీకునునీయవచ్చునుగా? మిమ్ముఁ గుహనావధానులనిజగమేఁ
చెప్పికొనియెడిని అనామకుఁడుకూడ నేదో వ్రాసెనుగాని నన్నుఁ గుహనావధానియని
వ్రాయలేదే? వ్రాసినచోఁ బేరుపెట్టియొక్కనింజాపుఁడు- మఱియు నాయనామకుని
వ్రాఁతను బ్రకటించికొని పశ్చాత్తాపపడి దిద్దుబాటును బ్రకటించినకేసరిలోని ప్రకటన
కు మీరేమియర్థమును జెప్పుచుంటిరి। మొగమెత్తుఁడు.

# A Correction.

## దిద్దుబాటు

### గుంటూరు అవధానము.

"గుంటూరు అవధానము" అనుపేరట సత్యవాదియను ఉపవిలే
ఖరి మాకు వ్రాసిన లేఖను వెనుకటిపత్రికలో ప్రచురించి యున్నారము.
అందు వేలూరి శివరామశాస్త్రిగారిచే చేయబడిన శతావధానము సరి
గా చేయబడలేదని సత్యవాదిగారు వ్రాసెను, ఇది అసత్యమగు లేఖ
గా మాకుతరువాత తెలియవచ్చినది. మరియు శివరామశాస్త్రిగారిని
శివరాముడనియు సత్యవాదిగారు వ్రాసిరి. మేము ఈపేరు కవిత్వము
చెప్పుటయందు తమనమ్రత (Modesty)ను జూపుటకు వహించిన నామ
మని దలంచి, దిద్దుబాటుచేయకుండ ప్రకటించినారము. వీరినిగూర్చి
మేము యెప్పుడును వినియుండకపోవుటచే ఇట్టిపొరపాటు తటస్థించినది.

# తొలిపలుకు

కII "కాకేమితన్నుఁదిట్టెను
గోకిలతన్నేమిధనము కోకొమ్మనెనే
లోకముపగయగుఁ బరుసని
వాకునఁజుట్టమగు మధురవాక్యమువలనన్"II

అనిసంకుసాలనరసింహాకవి వచించినదెంతయు ననుభవము. "గన్నవరమున వేలూరిశివరామశాస్త్రినిబరాభవముచేసితిమని యేమేమో వెడప్రల్లదముల స్వకరపల్లవములతో వ్రాసినవున కొప్పరపుసోదరుల గ్రామ్యసంభాషణకంటె మా వెంకటరామకృష్ణకవుల యుప్రసక్తప్రసంగములేసుప్రశస్తములు. ఏమందురా! కనుకలిమాత్రఁగొప్పరపుసోదరులు నాకుఁబరాజయముచేసిరి. శ్రీవెంకటరామకృష్ణకవులో వినుకలిమాత్ర నేనాసక్తనుగనిపట్టిరి. గ్రామ్యనాగరవిభవములకీమాత్రము భేదముండుటబ్బురముకాదు. ఔరా! యనాత్మజ్ఞత! శివరామశాస్త్రియనఁగా బిడాలోపాఖ్యానకర్తయేనా "యనియందలిరహస్యమును దాముగుప్తించినటులు చెప్పించియు నన్నుదూషించుటమిగులనసహ్యముకద. కానిండు. ఈ దోసపుగాలి యెంతవఱకు వీచవలెనో. వీరియట్టహాసమునఁ గొన్నిపంక్తులకే నేను ప్రత్యుత్తరమీవలసినను, విద్యావిషయముగుట మిగిలినదియు నప్రసక్తముకాదు. తొలుదొల్త నాకు మిగుల సంబంధించిన విషయమును, నటుపై శేషమును నచ్చొత్తింపఁబడినవి. అట్టహాసాంతర్గతమగు పత్రికాప్రహసనము కట్టినగుడ్డయగుటచే నిందుఁజేర్పఁబడలేదు. సహృదయులు క్రమముగ విచారింతురుగాక.

సహనావవతు ।
సహనౌభునక్తు
సహవీర్యంకరవావహై ।
తేజస్వినావధీతమస్తు
మావిద్విషావహై

వేలూరి శివరామశాస్త్రి
శతావధాని.

మనకుఁగానవతరించిన యభినవసరస్వతికిఁ బ్రచ్ఛన్ననామకులగు దొంగలవ్రాఁతలు బయటఁబెట్టి యథార్థమును నివేదించుట పొగడికయగునా! అదియీవిషయమై వ్రాసిన వ్రాఁతలలో మీరు ఖండింపఁదగినదొక యక్షరమేనియున్నచో సప్రమాణముగ ఖండింపుఁడు. అప్పుడుదానిఁద్రోసివేయవచ్చును. ఊరక దొంగలు దొంగలుగలసియూళ్లు పంచికొనినట్లు వ్రాయుటయునొకతెలివా! ఎప్పుడేని సత్యమునకేపాటు పడకలయును గదా మీకవితకిప్పటికిని సప్రచ్ఛన్నులవ్రాఁతలయందలి సత్యమెఱుఁగరాకున్న యెడిగాని యాంధ్రపత్రికవ్రాసినయేయున్నది చూడుఁడు. ఇంతయగౌరవముగా నీప్రచ్ఛన్నులను గౌరవాధికులు మామచుండమి, కవితయొక్క యనూయ, పొగడెగయుటకుఁగతమే మేజబాబోసఁగుఁడు. కృష్ణలో దొం. శుద్ధార్థవాదియిచ్చిన ప్రత్యుత్తరమే మేనియున్నదా! ఇట్లనేకప్రాజ్ఞులు నిరసించుచున్న యసత్యపుఁ బురాణమును మరలఁబ్రకటించికొనిన ఫలమేమి "కర్త్రాకారయితా" యను శ్లోకమునకు దాహరణమగుటకా! మీకవితయవివేకమును జాలవఱకు చూపితిని. ఇంకనుజూపవలసినవికలవు. గ్రంథవిస్తరభీతిచే నుపేక్షింపఁబడియె. ఇంకఁబ్రస్తుతమవధరింపుఁడు.

ఉ॥ నేనవధానముల్ సలుపనేరనటంచుమృషోక్తులాడు మీ
కేనుజవాబువ్రాయుటిదియెంతయుఁ బ్రస్తుతమయ్యెరాగి యే
గానికిమాలినట్టి యలకాకవులంబలెవేసికొన్న దొ
ఙ్కో నిజమెట్టిదో తెలిసికొందురుగాక వివేకులియ్యెడన్॥

ఉ॥ నాయవధానముంగనిమనంబున సంతసమందియిచ్చినా
యాయిమహానుభావుల యథార్థపు లేఖలుగప్పిపుచ్చియే
వాయియొపేరుమార్చికొని వాగినవాగుడుఁబట్టి యేదియో
గోయియొకండు త్రవ్వికొనఁగూడునెయందునఁగూలనెంచుచున్॥

ఉ॥ సోదరులార! నాపయియసూయవహించెదరేల! మీవలెం
గాదవధానముల్ సలుపఁగాఁగల "గాఁగలనంచుఁజెప్పికోఁ
గాదిటులేనునన్నుతిఁచి గర్వముగాఁదలపోయువచ్చుమీ
శ్రద్ధాయుపాయమేర్పఱచి యీవిశయమ్మునుదీర్చికోఁదగున్॥

ఉ॥ రమ్మనువారొ మీకడకురండని నేను లిఖింపనా సమీ
పమ్మునకీరువచ్చెదరొ భారముగాఁ దలపోయకుండ రం
గమ్మదిటమ్ముచేసికొని క్రన్ననఁదెల్పుఁడు నావధానపుం
గమ్మదనంబుఁజూపెద వికస్వర సుస్వరభాస్వరమ్ముగన్॥

చ॥ కలిగినపట్టుశక్తినిన్ గానొకచో సభచేసిమీకొగిం
దెలిపెదమీసుశక్తిసభ దెల్పుఁడటంచడుగన్ భయంబుమీ
కలవఁడుహేతువియ్యెడల నాస్త్రిజవాబునొసంగుఁడేదియో
గిలుకకరెంటనొక్కటికొగిన్ బదులీరు లిఖింపుఁడొప్పగున్॥

ఉ॥ కన్నులుదేవుఁడిచ్చెనవిగల్గినయందులకున్ ఫలమ్మదాఁ
దిన్నగఁజూచివ్రాయుటయె దేఁబెలకూఁతలు నిక్కువంబులో!
అన్నలు! తక్కుపండితుల యయ్యయివ్రాఁతలె నిక్కువంబులో!
క్రన్ననమీరుచూచెదగు గాకబహూక్తులు వ్రాయనేటికిన్॥

శా॥ లేదాచక్కఁగబుద్ధితెచ్చుకొని చాలింపుండుమీగోలసీ!
కాదంచుం గవివర్యులిచ్చెడివషట్కారంబులం జూచికొం
డీదారిన్ వినువుండు బాగుపడుఁడో తేయేశ్య శ్రీసూర్యరా
ట్ప్రీమన్ బట్టియునేనిఁగల్గవలెయిస్సీ! మీకహా యోగ్యతల్॥

ఉ॥ ఎల్లరుయోగ్యుఁడంచు నుతియింపఁగఁ బొంపిరివోవుసూర్యరా
ట్తల్లజుఁడొక్కమాఱు కవితంగనెనేనియు మీరువ్రాయు నీ
ప్రల్లదముల్ సహింపఁడవి పల్కెదనాకిటుతోఁచెనింక నే
నల్లనృపాలుఁడా కవితనారయు సంఘటనంబు గావుతన్॥

ఉ॥ ఆతఁడుచూచెనేని వృథయైనప్రసంగమువ్రాసి ద్రవ్యపుం
దాతకుఁగూడ దుర్యశముదార్చెదరంచుఁ దలంచి చక్కనా
నీతినిఁ జెప్పునంచు మదినేదలపోసెద నిప్పుడేనియూ
నేతభవత్ప్రసంగము వినీవిననట్లు క్షమింపకుండుతన్॥

మరియు సత్యవాదిగారు విద్యార్థికులనియు లేఖల వ్రాయుటయందు తమజవాబుదారి గ్రహించినారనియు మేము భావించుటవలన వారి లేఖను ప్రచురము జేసినారము ఇట్టి పొరబాటు గల్గినందులకు చింతిల్లు చున్నారము. [ఆంధ్రకేసరి]"

ఇవియేకదా కేసరిలోనిపంక్తులు, ఈపంక్తులకు మీరుప్రకటించిన తాత్పర్యము నొప్పికొనియెడి దద్దమ్మకూడ జగమునను0డెడునియోచలంచితిరా? ఇంతియకాక వారి జాబుకూడఁగనుఁడు.

J Gurunadham, B A.
Editor, Andhrakesari.

Rajahmundry,
Dated 13th October 1911

Sir,

Re-your registered card dated 11th October 1911, You are requested to refer to the 'Andhrakesari' dated 29th September 1911, page 6 column 3, when a 'correction' was published regarding the matter you have written to me about

I am advised to add that nothing more can be done.

M. R. Ry.
R. Hanumaiah Pantulu Garu, B. A
First Grade Pleader,
Guntur.

I am
Yours faithfully
Gurunadham,
Editor.

పిల్లికనులఁమూసికొని

పాలుద్రావిన నితరులు గుఱితింపరనుకొంటిరా? ప్రత్యుతము గాకున్నను మీరసత్యమునా డుటకుజంకరనుటకిఁక నొక మీవ్రాఁత కృష్ణాపత్రికలోమీరుప్రకటించిన గీరతవ్యాసము చూచినఁ జాలును ఈవ్రాఁతయెంత తెల్విగనున్నదో యావ్రాఁతయునంతే తెల్విగనున్నద ని తెలిసికొనుఁడు. బ్రః జయంతిభగీరథశాస్త్రులవారివద్దమీలో వెంకట రామశాస్త్రిగారు కొన్ని విశేషములను దెలిసికొనిరేమండి, అంతియకాని కామదిలోను శ్రారార్థము మొదలిడి పాఠము చదువలేదేమండి, ఇంతకన్న శాస్త్రులవారికే కొన్ని సంగతులను బోధింప వారి యొద్దఁబ్రవేశించిరనిన యుక్తము గానుండును "పిల్లికనులఁమూసికొని" అనుసామెతనుమ రలజ్ఞప్తికిఁ దెచ్చుకొనుఁడు ఈకారణముననే బ్రః శ్రీః మధునాపంతుల వెంకట

సుబ్బారావు గారు మిమ్ముంగూర్చి ప్రకటించియేయున్నారు. (అభినవ) వీరు మీ
కు ముఖ్యబంధువులని నేను వ్రాయుట పునరుక్తము మీతత్వముచే స్పష్టపడినుం
డియు నెఱింగిన యుష్మన్మహామహుండు మీకుందగినబిరుదమునిచ్చెనని సంతోషింపవలసి
యున్నది. వెంకటశాస్త్రిలవారికిని మీకును వివాదముగాన వారివద్దంజదివినదిలేదనుట
కవసరముగల్గినదికాని భగీరథశాస్త్రిలవారికిని మీకునుఅట్టిదిలవమునులేకేఆయీధోరణిం
బట్టి ప్రకృతము నన్నుంగూర్చివ్రాసిన యప్రస్తుతాట్టహాసము పట్టపగటిదొంగతనపు సా
మెతకుదాహరణమని నొక్కిపలుకకతప్పదు. దానికిందథ్యముగా కృష్ణనుండియేమి దేశ
మాతనుండియేమి యితరమునుండియేమివారందుసంగ్రహించిన వ్రాంతలన్నియు ననామ
కులవి అనంగాం జేరుదాంచిప్రకటించినదొంగలవి యగుటంగూడంబ్రబలాధారము దర్బా
రునుండికూడ మీరేవోసంగ్రహించియున్నారు, అయ్యవినాకు సంబంధించినవికావుగా
న విమర్శింపకమిన్నకుంటిని ఈపంక్తులంగనుండు అభినవసరస్వతి॥ (రోషముతో) వారి
విషయమై యిట్టిమాటలు నీవనవలయుంగాని మఱెవ్వరుననరు.........కృష్ణ॥ అభిన
వసరస్వతి మాటలకేమిలే దానికేమేనివ్రాసియిత్తురని వారినట్లూరక పొగడుచుండును॥
ఈప్రసంగ మెందులకుం జేయవలెను. అభినవసరస్వతి మీకేమపకారముచేసినది, సరస్వ
తినోటనుండి వచ్చినమాటలుగాక అపభ్రంశనామముగల పత్రికలమాటలా మీకుంబ్ర
మాణము ఇదిగాక కృష్ణ యీప్రసంగముచేసినట్లు వ్రాసితిరిగదా! అందులకుంబ్రమాణ
మీయంగలరా! మఱియు నీ మొండిప్రసంగముగూడ శోచ్యస్థితిలోనేయున్నయది దేశ
మాత॥ ఎందులకూరకకలహించెదరు ఆవిషయమై కవియు రాజానగు మంత్రిప్రగడభు
జంగరావుగారి నిష్కృష్టాభిప్రాయమొకటిచాలును" ఈవ్రాంతలో సత్యతత్పరుండన్న వి
శేషణము మీరువేయమఱచితిరి. అదిగదా ప్రకృతముకావలసియున్నది. అయనవ్రాసిన
యప్రస్తుతవ్రాంతకుం దిరుపతివెంకటేశ్వరులిచ్చిన ప్రత్యుత్తరమునుగూడం బ్రకటించి
దానికైశ్రీభుజంగరావుగారికుత్తరముద్రోంపక మిన్నకుండిన పిదపంగూడ దేశమాతయి
ట్టిమాట నెట్లుపలుకనోనాకరయరాకున్నది లేదా యాదేశమాతచేమరల నీమాటబలి
కింపంగలిగితిరేని కొంతయుక్తము, మీరులేశమును సంశయములేక యేదోవ్రాసికొందుర
నుటకుంబ్రమాణములనేకములుకలవు. "తెలియమే రామకృష్ణులతోవిరోధించి శృంగభం
గముగన్న భంగియెల్ల" ఈపద్యము లెవరో శాఖాఖమానివ్రాసినవ్రాయుంగాక మీవ్రాసి
నశృంగభంగము నిదివఱకు దెగడినవారేగాని పొగడినవారొక్కరునులేరుగదా ఏవిధ
ముగా నీపద్యములును ప్రకటింపంగలిగితిరో సెలవొసగుండు అభినవసరస్వతిగౌరవమె
ట్టిదో దర్బారుగౌరవమెట్టిదో మీకుందెలియకపోవుంగాక లోకమెఱుంగుంగదా! ధర్మ

ఉ॥ పత్రికయన్న సత్యమునుబల్కుట కేర్పడెనంతెకాని యే
కృత్రిమపుంబ్రసంగము లిఖించుచు సత్యముగప్పిపుచ్చి స
ర్వత్రచివాటులందినెడి పత్రికపత్రికయౌనె? "కాదుమా
పుత్రికయంచుఁబల్కెదరొ పుత్రికయిట్టిదిపుట్టియేమగున్॥

(గారవుబిడ్డ)

ఉ॥ నేనవధానమున్ సలుపనేరనెయంచును జింతబెంపుఁడ
ద్దాననెయౌదురొక్కొ యవధానులుమీరలునాయశక్తిచే
లేనిసుశక్తి మీకెటులవెలింగెడి దొంగలవ్రాఁత లింకపై
నేనిస్వపత్రికం గొనకుఁడెవ్వరు నవ్వెదరయ్య సోదరుల్॥

ఉ॥ దొంగతనమ్మొనర్చునయదూరుఁడుమాత్రమెదోషిగాఁడువాఁ
డంగడినమ్మఁ వస్తువుల నార్జనచేసినవాఁడుగూడ స
త్సంగతుఁడయ్యు దోషియగు సత్యమెఱింగి పరిగ్రహించెనే
నింగణియింపశక్యమగునే? యపరాధముచర్చసేయుఁడీ!॥

ఉ॥ చాలువృథాప్రసంగము ప్రసక్తికిఁగాని ప్రసక్తిగాననున్
బాలిశుఁడంచువ్రాసినయపాత్రపు వ్రాఁతకుఁ దప్పుదిద్దికోఁ
జాలిన పత్రికల్ దెలిసి చట్టనరే శివరాముఁ డన్నయా
వ్రాలునెటుల్ లిఖించితిరి వారికిఁదప్పయిమీకుఁ గాదొకో?॥

మ॥ శివరాముండనువ్రాఁత తప్పనుచు వ్రాసెంగాని భ్రష్టయ్యెనా
యవధానంబనుమాట కాదనుచుమీ రర్థంబుగల్పించుచున్
శివరాముండను నక్కరంబులను నిస్సీయెట్లువ్రాయించి స
త్కవులం దేర్పఁదలంచినారొ యవివక్కాణింపుఁడో సోదరుల్॥

చ॥ శివుఁడనొ లేకరాముఁడనొ చేసెదనో మఱిచేయలేనొ నా
కవనముచూపఁగాఁ దలఁపుగల్గిన జాబు లిఖింపుఁడూరకే

# VIII

సువిసున్నఁగక్కు పద్దెముల నూరులు నవ్వ లిఖింపనేల? యే
కవితయొ తేరఁగా నొకటిగల్గుటకున్ ఫలమిట్టిదా నొకో!॥

ఉ॥ తక్కినదాని కేమి యవధానము నాయది యెట్టిదో భవ
ద్వ్యాఖ్యనఁ బల్కఁ జేయుటకుఁ దద్దయుఁ గోరెద మీరు పత్రికా
ముఖ్యులుగాన యత్నమిది పోలక పోదిదె మ్రొక్కుదున్ 'శివ
మ్మెక్కినచోట మ్రొక్కకెటు లేదికిఁ దీరదు' నాఁగ వింటిరే॥

మ॥ సభకున్ రావలె నోరువిప్పవలె మీ సామర్థ్యముం జూపి వా
గ్విభుతం గాంచవలెన్ వృథాగ నొకచక్కిన్ డాఁగి నానాఁట రా
సభముల్ గోకిన పాఱువ్రాఁతలకు దాసత్వంబు గావించు మీ
కుభయాంబా! మతిభక్తియా! యుఱకెటో ఘోషింతు నిచ్ఛాగతిన్॥

ఉ॥ వచ్చెద నమ్మటన్న నృపవల్లభునాజ్ఞను బొందిమీరలే
వచ్చిననింతకన్నను శుభంబు సేయుఁడు లేదయౌని యే
పిచ్చియొ వెల్లఁగ్రక్కఁ గనుఁడు పెద్దలు నవ్వ మనున్న వారు మీ
కుచ్చితపు ప్రసంగములకుం జెవియొగ్గఁడు ప్రాజ్ఞుఁడొక్కఁడున్॥



# తాలుకుట్టనము

"సరసపరిషత్కర్ణశ్రావ్యంకవిత్వరసాయనం
విరసమనసాంనేతుంనేహామహేశ్రవణాన్తికమ్
మృగమదరసంబింబోష్ఠీ నాంకఠోర కుచోచితం
జఘననికటేక్లిన్నేలిమ్పేజ్జరన్మహి షస్యకః"

ఉ॥ కొండల బండలన్నదుల గొప్పసముద్రములన్వెలుంగు బ్ర
హ్మాండము మ్రింగనెంచిభవదాస్యబిలంబుననుండివచ్చునీ
కొంచొక యట్టహాసమునకుం గగురీతిగఁ దాలుకుట్టనం
బొందు రచింపఁగావలసె నుక్కిరిబిక్కిరి కాకయుండుటన్.

ఉ॥ దగ్గినఁ దుమ్మినందనకు దాపున వారికినోటితుంపరల్
వెగ్గలమై మొగానఁబడి పెల్లుదయింపఁగఁజేయుఁ గోపమీ
పగ్గియదెట్టిదో కడునెపంబులు పంబిన యట్టహాసపుం
గొగ్గితలల్ గనుంగొనిన గోలె నసహ్యముతానపుట్టదే?

శా॥ కైలాసాచలసానుసీమలను శ్రీకంఠుండు తాఁదాండవ
వ్యాలోలుండయిదిక్కటాహములు శైత్వ్యంబందఁగాఁ జేసెను
ద్వేలప్రక్రియ నట్టహాసమును దద్విక్రాంతిఁ జూపింపఁగాఁ।
బోలెన్ వీరలుకూడఁ జేసి రిటులంబో! అట్టహాసంబునన్.

గీ॥ అతిశయముమాకె కాదుమాహాసమునకుఁ
గూడఁ గలదంచుఁ దెలిపెడి మాడి"*కట్ట"

---

అట్టహాసము.

చ॥ కదిసిన నోరవోవుచును గబ్బుపుదొంతుల సత్పదార్థముల్

---

"*అట్టావతిశయక్షేపా"

యనుపదంబును దగిలించుకొనుట లెస్స
యతిశయమ్మున కతిశయ మ్మార మీకు.

ఉ॥ పిచ్చినిమ్రగ్గు మానవుఁడు ప్రేలునెటో యెదురున్న వాఁడుతా
సచ్చరితుండు నైనను బ్రసక్తికిఁగాని ప్రసక్తిగా వృథా
కుచ్చితపుం బ్రసంగముల గొణ్గును, నవ్వును వెఱ్ఱినవ్వుఁ జే
రిచ్చకమాడుఁ గూడదనె నేనియుఁ ద్రోయును కాలఁదప్పులన్.

శా॥ మేలా నాలుగు పిప్పి ముక్కలను నెమ్మి న్నేర్చి యెవ్వారిపైఁ
గాలుంద్రవ్వఁగ నీతి యింతవలదా! కయ్యంబె వియ్యంబుగా
నాలోచించి రజఃకణాంబులను దానట్టిట్టులం జిమ్మి డీ
కోలుం జేసెదు నాలపోతు బలె మైకోల్నేతయే పాడియా?

ఉ॥ "దారిని దప్పిపోతిర"ని ధార్ఢ్యముగా వచియించినట్టి వే
టూరి ప్రభాకరుండు భవదుత్తరపాత్రుఁడు కాక శిష్యధి
క్కారము నొందఁ బాత్రతనుగాంచెనొకో, "నయ"మింతచాలు నీ
గౌరవముం బ్రశిష్యునికి కారము పంపఁగఁ జేయలేదుగా.

చ॥ తిరుపతి వేంకటేశులకె తిన్నఁగ జాబునొసంగ గౌరవ
స్థిరతకు లోటుగాఁ దమరు తేల్చెదు సప్పుడు వారిపాదపం

---

కదుకుచు నెట్టివారిఁ బొడఁగన్నను గట్టిని స్నేహసౌఖ్యముల్
మదికి నసహ్యమౌ కునకమార్గమునం జరియించుచున్న దు
ష్పృథకవులెల్ల మత్కృతిఁ దప్పులుపట్టక యూరకుండుఁడీ.

శా॥ గాఢార్థ ప్రతిపాదన క్రమకళాకౌశల్యముల్లేక వా
చాటక్కార్కటితోడఁ దామతమమర్ఘ్యాయంచుఁ గైవారముల్
ప్రౌఢిం జేయుచుఁ బ్రాజ్ఞులన్నగుచు గర్వగ్రంధులైయుండు న
మ్మూఢ స్వాంతులు మెచ్చకుండుటయ సమ్మోదంబు మాకొంట్లకున్.

కరుహారజఃకణంబులవి కన్పడునే పయిపైని బండిపై
నరుగఁగఁజాలునట్టి తమయంతటి వారలకన్నుదోయికిన్.

చ॥ అలవడకుండుఁగాక తమయంతటిపాండితి లేకపోవుఁగా
కలఘుకవిత్వవిస్ఫురణ యబ్బకపోవునుగాక యిందిరా
కలుపదయాప్రసారము చకారగుడుల్ తమ నోటనైననున్
వెలువడఁజేయఁగాఁ దగు వివేకమొకించుక లేని వాఁడొకో?

మ॥ కవితావాసనయింతకల్గినను బింకంబూని సర్వజ్ఞుఁడం
చవలోకింపఁగఁ జన్నె? మాలకరి యొయ్యంబూవులం గ్రుచ్చురీ
తి విశేషంబొకో! మాటలల్లుపనినాదేశంబు గాపాడుటో
కువిధంబియ్యది యెంతచెప్పిన నహా! కుక్షింభరిత్వంబెనూ!

ఉ॥ పద్దెములన్నమాత్రమునఁ బామరులందఱు బ్రహ్మవిద్యయే
యిద్దనుకొందు "రింత యిది యెందుకు" నీచపదార్థపుంజము
న్ముద్దొదఁగూర్చునట్లు కవిముఖ్యుఁ డొనర్పఁగవచ్చుఁగాని యం
దొద్దిక బుద్ధిచొప్పఱచి యోజనచేసినఁ దేలకుండునే?

---

ఉ॥ చాలఁగదోషముల్ దెలియఁజాలక యల్లికలల్లనేర్చుటల్
రేలుబవల్లు సత్కవులరీతిని నిక్కిన కాకవుల్ ధరన్
బోలరు సత్కవీశ్వరుల పోలిక రాజమరాళపుంజముల్
పాలును నీరువేర్పఱచు భావముకాకములందుఁ గల్గునే?

చళ్లపిళ్ల వేంకటశాస్త్రిగారు స్వీయనామముతోఁ బ్రకటించు పాశుపతమువలెఁ గాక యాచార్యనామధేయప్రణీతమ్మయిన యత్యద్భుత విమర్శనము కర్ణకఠోరములగు వాక్యములచేనిండియున్నది. ఇందుఁబరనిందలు నాత్మస్తోత్రములుదక్క వేఱువిషయము లెవ్వియుఁ లేవు. కావున దీనికిబదులు వ్రాయనక్కఱయే లేదు.

ఉ॥ మెచ్చియొకింతగౌరవము మెచ్చకయుండి లఘుత్వరేకముల్
దెచ్చుటకున్ సమర్థులె కృతిక్రియకుం గు కవిత్వగర్వితుల్
తచ్చరితంబు పేతుకుచితంబగుఁ గాకనగంగనైనవా
గ్రుచ్చియబాగళస్తనస గోత్రులువారలనెన్న నేటికిన్

ఉ॥ దొంగతనమ్మొనర్చు నయదూరుని కైనను దీపమార్పుచో
ముంగలనున్న పెంధనము ప్రుచ్చిలుచో నెలుఁగెత్తఁబీఁకె ను
క్కుం గమకించుచోఁ దెలుపుఁగాదని కూడదటంచు నాత్మయా
వెంగలి లొంగఁ డాత్మకవివేకపు మాయయె యావరింపఁగన్.

చ॥ తెలియకకాదు మీరలిటు తిట్టితిరయ్యయి వారలంబసం
దులు దులకించు మాటలను దొప్పలుదోరలుగాఁ గవిత్వపుం
దళుకు బడాయిచూపెడు విధంబది మీామది నెంతయున్నదో
బళిబళి! యెంతయుండినను భాగొకొ యింతటినోటివట్టముల్.

మ॥ జననంబాదిగ సంగడంబొ మఱిశిష్యత్వంబొ యింకేదియో
పెనుసంబంధముకల్గి యేదొయొకఁడా ద్వేషంబు దోషంబుచే
తను నవ్వాని రహస్యసంగతులపుంతల్ లోకముంగూర్చితె
ల్పినచో వానికి నట్టిదుష్టునికి నోలింగల్గునే నిష్కృతుల్.

చ॥ తనకువిరోధమున్నదని తక్కొరుఁడెవ్వఁడొ ద్వేషినిందచే
సిన విని సంతసించి పగచేఁ దమపక్షమువాఁడటంచుఁ బె
ల్చనుసిపమెత్తి యాడుటయుఁ జంకలుగొట్టుట యట్టహాసపుం
బనులును నోటివట్టమును బైల్పఱిచెనిదెంతవింతయో.

---

అనుపింగళినూరనార్యుని వచనమనుసరింపఁ దగినదియే. ఐనను "వేసినకల్లనూ రకున్న వెళ్ళివాఁడే గెలుచు" ననుసామెతను వెలచి యాపొల్లుమ్రాఁతలను జవాబుచెప్పఁ బూనినారము. సహృదయులఁ మన్నింతురుగాత! శాస్త్రిగారూ! వేంకటరామకృష్ణ గ్రంథమాలలోని మొదటిపీఠిక యత్యద్భుత శతావధానమునకే సంబంధించునదిగావున రాజానురంజనమునకు మొదటనుండఁగూడదనికదా? మీాకుశంక! వినుండు.

శ్రీ పీఠికాపురమ్మున మామొదట మేమొనరించిన యవధానములకు రాజానురంజనము పద్యరూపముగు నుపోద్ఘాతమునఁదగి యున్నది. కాని యందు ఘంటాశతవిషయము మాత్రము ప్రస్తావింపఁబడలేదు. అంతకుమున్నె మేము శతవిధానమునొనరింపఁదలంచుకొనకుండుటయే దానికిఁగారణము. ఐననుభవితవ్యతాబలమ్ముచే ఘంటా

గీ॥ తమవిరోధికి నింక శాత్రవుఁడొకండు
దొరికెనంచును నింత సంతోసమేల?
సున్న పైసున్న లెన్నేనియున్న నేమి
పెరుఁగునోడలి బలంబుసూపింపనోటు?

ఉ॥ అట్టివిరోధివైరి తమకాప్తుఁడఁటంచును దత్కుశక్తికిం
బట్టముగట్టి తాను నలవారలకన్నను మిన్నయయ్యె నె
ట్టట్టులొ దాసభావమును తేదియొ చేసెడిరీతి గగ్గువా
గద్దుల నీతియింకఁదమ గౌరవమేని నెఱుఁగఁగోరెదర్.

గీ॥ తనకు మేలును గీడువిన్ననువ్వుపఱచు
శక్తిచేతను దీపారుసంగడీంద్ర
నట్టుపడుఁజూవె సంపాదనంబు చేయ
నోటిదుడుకున్న ద్వేషులు కోటిమంది.

మ॥ అది యేమో గ్రహచారమొక్కని మొగంబావంతగాంచంగఁ బె
ల్లుదయించుర్ గడు నీసా, లేక మఱిసాంపో, యేదో వష్టాష్టకం
బాదవర్ శత్రులకేమి లోటియలఁ జేయూపంగనే దారిసె
ట్టెమరా వారలు నెల్ల శాత్రవులు కానేలా! ప్రయత్నింపుటల్.

సీ॥ తమయిచ్చవచ్చువృత్తములఁ బృచ్ఛకులయాం
కాంక్షదీర్పఁగ నొక్కగంటయుంట
చెప్పినదొప్పునఁ దప్పులు లేకుండఁ
గాన్రాయ మఱియొకగంటయుంట

---

శతబీజమందు నాటఁబడియే యున్నది. అత్యద్భుత శతావధానక్రమమును దెలుపు నీపద్యము నరయుఁడు.

ఉ॥ చేయుటకొక్కగంటయది చెప్పినదొప్పునఁ దప్పకుండఁగా
వ్రాయుటకొక్కగంట సరి నారలలో నవధానపాండితి

ధారణానూనావధారణచేఁ జక్క-
గాఁజదువుట కొక్కగంటయంట
అరుదెంచు సభ్యుల యంతరాంతర ప్రసం
గంబుచేయుట కొక్కగంటయంట
గీ॥ వెరసి నాలుగుగంటల పేక్ష్యములఁట
తగునఁ టత్యద్భుత శతావధానమంట
ఔర! యిద్ది విమతభయంకరమఁట
దండ మత్యద్భుత శతావధానులార.

చ॥ తమకుఁదమంతఁజెప్పికొను దార్ఢ్యముసూపినభావమీయదీ
యమలవివేకముంగలిగినట్టిరయేని భవద్విధానముల్
విమతభయంకరంబులని లెక్క-నుఁజేర్పఁగవచ్చుఁగానిచో
నెమిలికడానియీఁకెలనుసేర్పుగఁదాల్చినకాకమౌఁగదా.

గీ॥ నూఱుపద్యమ్ములొకగంట నూటిపోయ
వచ్చుఁగాకట్ల చెప్పినవానినట్ల
మఱలఁ జదివెనుపట్లనుగుఱికిబారె
డెచ్చుఁ దగ్గంచు సందేహ మెసఁగునయ్య.

---

స్థేయతకొక్కగంట యరుదెంచిన పెద్దల గారవింప నొం
డొయరగంటయో? వ్యక్తధియుండవలెఁ ధరణీపురందరా!

శతావధానము నాలుగుగంటలలోఁ జేయుదుమనియు, నందుఁ గవిత్వముచెప్పు ట కొక గంటయనియు, లేకరులు వ్రాయుటకొక గంటయనియు, మేముధారణచేఁ జదువుటకొకగంటయనియు, సభ్యులతోఁగలుగు నంతరాంతరప్రసంగమున కొకగంట యనియు నుజ్జాయింపుగాఁ బంచి యిందుఁ జేర్కొంటిమి. ఒకదానికాల మొకదాని కాలములోఁ గొంతకలిసినను మొత్తముమీఁద సరిపడి నాలుగుగంటలలో నవధానము పూర్తికావచ్చుననియు, మధ్య ప్రసంగమంతగా రాకున్నచో నాకాలము గూడివచ్చు ననియు నూహింతిమి, అంతియకాని మేము కేవలము గంటకు నూఱుపద్యములు చె

చ॥ ప్రకృతము సత్కవీశులున భాస్థలిఁ జేయు శతావధానముం
ప్రకరణమందనంగ నొకపాదము వెంబడి నొండుపాదముం
బ్రకటనచేసి యంతయును బాఠమునప్పనచేయు వేళయం
దె కలుగుఁదొట్రుపాటులని తెల్పఁగ నేలబుధుల్గ్రహింపరే?

చ॥ ప్రకృతశతావధానమునఁ బాదము చెప్పెడివేళయందు శ్రాం
తికలిగి స్థానపుంగుఱుతు తెన్నిడినన్ మఱిఁగొంతకొంత పృ
చ్ఛకుని విశేషమొక్కొకట సాయముచేసిననుంబొసంగుఁ గొం
త కసమసల్గదా నవవిధానమునం దివియేని లేవుగా.

గీ॥ శతవధానముచేయంగ శక్తిలేని
వాని కెట్టులఁ దెలియు నుపాయమట్లు
కాన యత్యద్భుత శతావధానమెఱుఁగ
నట్టి వార లనుదురంచు నందు రేమొ.

శా॥ వేగంబూనుచు నూఱుమందికి భవద్వ్యాధ్యుక్తమార్గీతి ధా
రాగాంభీర్యము పొంగిపొర్ల రచనారంభింబునుం జేసి వా
చాగాథం దగధారణం జదువ నుజ్జాయింపుగా నేకసం
థాగ్రాహిత్వము నాఁగ దీనికణుమాత్రంబున్ భిదల్లేవుగా.

---

వ్రాతలంపుతో నీపద్యమునందలి మొదటివాక్యము లిఖించియుండలేదు. ఈయర్థము నీ పద్య స్వభావమే ధ్రువపఱుచుచున్నది. మేమును బ్రహ్మోదవంశ పీఠికలో నీయభిప్రాయమును వెల్లడించియున్నారము, కావుననే యందు "మేమెప్పుడు నిట్లుచేయుటకుఁ గలలోను బ్రయత్నించియుండలేదు" అని నిష్కర్షించితిమి.

చ॥ అమలవివేక! మీరలొక యష్టవధానముగాఁగ నెంతురో
కమనమనమ్మునన్ శతవధానముఁ జూడఁగ వేడ్కగల్గినా
విమతభయంకరమ్మగు నవీనవిధానము చిత్తగింతురో
నిమసములో నొనర్చెదము నేనిదిగోరితినంచుఁ జెప్పఁడే.

సీ॥ *ఒకమాఱు విని కళానికరంబులెల్ల నే
రిచి ప్రౌఢయైనావరరుచియొకండు
†తురకమానంతు పోటరుల కయ్యపుబాస
బోధచేసిన జగన్నాథుఁ డొకఁడు
‡నరసభూపాలీయ నామకాలంకృతి
గ్రంథసంధుఁడు మూర్తికవియొకండు
§చుళుకిత షట్శాస్త్ర జలధియై నెలకూచి
బాలసరస్వతీ ప్రాజ్ఞుఁడొకఁడు

గీ॥ తగినవట్టున కేక సంథాగ్రహత్వ
బిరుదపరికరులైరి యాపరమగురులె
యేకసంథాగ్రహత్వ మింతింతయొకర్క-
వానినాలుక శారదవరలవలయు.

సీ॥ ఎవని నాలుక శారదేందు బింబస్ఫుర
ద్భాసురాంబరకు హాల్లీసకంబు
ఎవని నెమ్మొగము బంహిష్ఠామర జ్యేష్ఠ
చతుర్థవాణికి మహా చత్వరంబు
ఎవని సత్కృతి కళానివహపర్యంకికా
భృణరస్థితకు నవ్యపర్ణశాల
ఎవని యభ్యూహ యుత్కృష్టశబ్దాహ్వయ
దీపదీపితకు ఘంటాపథంబు

---

ఇందు రెండవపాదమునందుఁ జెప్పఁబడిన శతావధానము చేతియొకపాద:

---

*కథాసరిత్-లంబ 1చూ2-౩. †రసగంగా--పీఠిక, చూ. ‡సీ॥ఏకసంధోచిత శ్లో
భాషాకృత్యచతురు--నరస॥ §వాడుక.

గీ॥ ఎవఁడు పూర్వజనుస్స్వత్ర సవనవిర్వి
శేషసంతర్పితాశేష శిష్యలోక
గీర్యథావత్త్వతామల కీర్తిసితప
తాకుఁడవ్వాఁడ యేకసంధాగ్రహుండు.

ఉ॥ కావున నెంతవారికెని గష్టమటంచును నొక్కి చెప్పఁగం
కావసరంబు లేద, యిటులద్భుతు లెందఱో లేకపోవుటే
యీవిధిచాలఁగష్టమనియెంచఁగనిశ్చయసాక్ష్యమాత్రదిలో
కీవిజయైకతానులకె కేవలసాధ్యము దీనినమ్ముఁడీ.

గీ॥ ఉక్తనియమప్రకార సంయుక్తముగను
దగఁగ నత్యద్భుత శతావధానసరణి
నెవఁడు నిర్వహణము సేయనెచ్చుగాఁడె
యేకసంధాగ్రహత్వంపుఁ బోకడలకు.

---

చెప్పనవధానమని తెలియనగు. మూఁడవపాదమునందుఁ బేర్కొనఁబడిన వినూతభయంక
రమగు నవీనవిధాన మత్యద్భుతశతావధానమే. కాని శతవిధానమెంతమాత్రమును గాదు.
మీరు ముందొకచో నీపద్యమునకుఁ జేతగాని యర్థము చెప్పుకొని శతవిధానమునకన్వ
యించి "ఇవి వీరు మొట్టమొదట శ్రీవారియొద్దఁజేసిన ప్రతిజ్ఞలుగదా? అంతకుమున్న
చేసి చూచుకొనకుండ నెట్లు ప్రతిజ్ఞసేయుదురు? ఇంటగెల్చికదా రచ్చగెల్చుట? రా
జానురంజనము పూర్వమా? విధానరచన పూర్వమా? " అని శంకించి మీ వెఱ్ఱియంత
యుఁ బైటఁబెట్టుకొంటిరి సుఁడీ!

చ॥ * * * * మీసభాస్థలముఁజేరి వధానము నాచరింపఁగాఁ
గుతుకము గల్గియుండె సముకూరుపునుయ్యది చూడఁ జాల న
ద్భుతమెటులన్నఁ బృచ్ఛకుఁడు దోఁచినవర్ణనఁ గోరుమండ నా
చితిగల సత్కవుల్వినుతిసేయఁగ సోయగమైనపద్యముల్
శతమొకగంటలో సలుపఁజాలుదు * * * * *

ఇదియు నత్యద్భుత శతావధానమును దెలుపునదియే. ఇట్లే రాజానురంజనము
మా మొదటి యావధానములగుఱించి పెక్కువిషయములఁ దెలుపుచున్నది. గద్యరూప

ఉ॥ ధారణతప్పకుండఁ గవితల్లజులందఱు సూచుచుండ మీ
గోరినపద్దెముల్ గొనియొకోవిదులందనియించుచోఁ గడుం
గోరికెలుల్లసిల్లఁ బలుకుంజవరాలి వరాలురాలు బం
గారురువారవుందళుకు గద్దియఁబట్టము మీకుఁగట్టమే.

ఉ॥ నూటిని జెప్పి ధారణననూదితముందగఁ జేయఁబోవఁ బో
రోటు! పృథక్షి ్నతిన్నములు వొక్కొకపద్దెమునొప్పఁజెప్పఁగొం
చాట యి దొక్కగొప్ప యలవాటుపడంగడఁగన్ గడింది స
య్యాటగ "మూలనున్న ముసలమ్మయు"జేయు విగేయపద్ధతిన్.

శా॥ ఆచార్యుండన లేదటంచుఁ బదివేలందింపఁగానేల? నే
నాచక్కందగ దెల్పుదున్ మొదట సాహస్రప్రతుల్ మాత్రమే
మూచూపంగత మేమి?యీయుదొకతప్పంగాదొయత్యద్భుత
ప్రాచుర్యార్థ శతావధానములు పొల్వంబోలవే, లక్షలేన్.

సీ॥ కడుమెచ్చియును గుణగ్రహణ పారీణులా
తురత నీబిరుదంబు తొడిగిరంట

---

మగు పీఠికయు నాయవధాన తంత్రమును గొంతసంగ్రహముగా బోధించుచున్నది. క
ని యొక్కయద్భుత శతావధానము నే సంబంధించి యుండలేదు. మఱియు నది రాజ
నురంజనమును గుఱించియు ముచ్చటించియున్నది. విచారింపుఁడు కావుననే మొ
మొదట నవధానచరిత్రమును దెలుపు గద్యరూపమగు పీఠికయుఁ బిదప నవధాన లక్ష
ణము మున్నగు వివిధవిషయములను దెలుపు రాజానురంజనమును గూర్పఁబడినవి.

ముఖపత్రము దళసరిగా లేదనియుఁ గాగితములు పలుచగా నున్నవనియు శం
సనందులకు మీకుఁబదివేలు. ఆహా! ఎంతచక్కని శంకచేసితిరి! హా! హా! హా! ఎం
తమంచిశంక!! హా! హా! హా! హా! ఎంతదొడ్డఁ శంక!!!

"చరికొండ ధర్మకవి నాఁటినుండిలేని యీయత్యద్భుత బిరుదము, వీరియవధా
మున కెందుకు రావలెనో?" యని మీరు విచారించిన నేమిలాభము? గుణగ్రహణ ప
ణులచేనొసఁగఁబడిన యీబిరుదమునకు విచారమేల? అల్పక్షోలు, ననూయాగ్రస్తులు,

అల్పజ్ఞులును నసూయాగ్రస్తులంబోలెఁ
బండితులను మెచ్చకుండ్రెయంట
చరికొండ ధర్మనసత్కవీశాదులా
వారల నట్లుంపవలయునంట
కవులమంచను నహంకారులు తిర్పతి,
వేంకటేశ్వరులు పిర్వేఁకుదురఁట
గీ॥ గుణవిదుల్ బిరుదులు తొడుగుదురుగాక
పండితులె మెచ్చెదరుగాక దండికవుల
టుండ నెవ్వారుచేయలేరోటుమీరు
పోలఁజేతురు కాఁబోలుఁ బోలుఁబోలు॥

ఉ॥ మీరలుచేయలేరనిన "మేమెయటంచును విఱ్ఱవీఁగు న
వ్వారలె చేయఁజాలరలవారలు తిర్పతివేంకటేశులం"
చారయఁజెప్పి యెవ్వరినొ యాఁడివెట్టుట లచ్చనంబొకో
ధారుణిఁ "దేరగుఱ్ఱమును దంగెడుబర్కె"యనంగ నిట్టిదే॥

---

హంకారావిష్టులు విచారింతురని సరసులు పండితుల మెచ్చకుందురా? ధర్మనాదులన ట్లుంపుఁడు! ప్రస్తుతము మేమే కవులమని విఱ్ఱవీఁగు తిరుపతి వేంకటకవులెన్నఁడైన నిట్టియవధానమును జేయఁగలిగిరా? గోరంతలు కొండలుచేసి యిరువదిమందికి, ముప్పది మందికిఁ జెప్పినవన్నియు శతావధానములేయని పేరుపెట్టి యాగుట్టు బయటఁబడకుండ శతావధానసారమను నొక గ్రంథమునుబన్ని యందొక్కొక్క యవధానమునకుఁ బదిరో యిరువదిరో (అందుఁ గొన్ని యింటియొద్దఁ జెప్పుకొనినవే) పద్యములుమాత్రము వ్రాసి మేమానాఁడాసభలో నావిధముగఁ జేసిన శతావధానములోనివని తప్పవ్రాసి లోకులఁగనుబ్రామినయవధానములకంటె సర్వవిధముల నీయవధాన మత్యద్భుతముగ నుండకపోలేదు. కావున నీయత్యద్భుతబిరుదమష్టైకశతావధానములకుఁ జెల్లదు గాని నిరాఘాటముగ రాజసభలోఁ బలువురుపండితుల సమక్షమునఁ బృచ్ఛకులు సభ్యులునను మోదించునట్లు నాలుగుగంటలలో నొనరించిన యీసంపూర్ణావధానమున కది తగియే యున్నది.

చ॥ గురువులు కార యాదురని గొణ్గఁగ నేల? కవీశ్వరుల్ ధురం
ధరులును బొల్వఁగా నవవిధానము మీరలె చేసి నెగ్గుచోఁ
దిరుపతి వేంకటేశ్వర సుధీమణులే తమశిష్యకోటిలోఁ
బరగుదురింత నిక్కమని పండితులెంతురుగాక యింతటన్.

శా॥ ఈడంబోవక వెంట వెంటఁబడి యేదేనొక్కఁడేమాటమా
టాడంబోవ, విమర్శనాలుపది వ్రాయంబోలు మీబోంట్లకీ
జాడల్ లెక్క-యెదూడ లెక్కుఁడఁటయాశ్చర్యంబునిండారఁగాం
డాడంగాఁదగు గ్రంధరాజమది మీటాత్మాలకుంజంకునే?

క॥ ఆనందమనుట యిది ప్రా
సానకుఁబను పాట్లు నాఁగసత్యము జెప్పన్
మానియు మీరొన్డువున వి
జ్ఞానపుఁ దాత్పర్యదండకంబగు నొక్కో॥

---

అమాయికలోకమా! శతావధానసారములోనివన్నియుఁ దిరుపతివేంకటేశ్వరుల
చేఁ దుదముట్టింపఁబడిన సంపూర్ణావధానములేయనియు నందుదహరింపఁబడిన పద్యము
లాయవధానములసారమనియుఁ దలంపకుము! అందందు వారుచేసిన యష్టావధానప్రా
యములగు కొన్నియవధానములకు శతావధానప్రతిష్ఠ నిలుపుటకై యీగ్రంథము పాటు
పడుచున్నదన్ని తెలిసికొనుము!! విస్తరమాగ్రంథవిమర్శమున వ్రాయఁబడుచున్నది.

ఆచార్యా!

శా. సందర్భమునుజూచి చెప్పెద మెడన్ శార్దూలవృత్తంబుమా
కందైనందగియున్నచో నపుడు మత్తేభంబు నిర్మింతుమా
నందంబందినఁ జంపకోత్పలములన్ సంధింతుమీప్రయత్క్రియన్
గందంబొక్కఁడఁ గీతమొక్కఁడను వక్కాణింతు మిచ్ఛాగతిన్

పైసందర్భపద్యము మీకసందర్భముగాఁ గనుపట్టుట వింతకాదు. "ఆనందంబంది నఁ జంపకోత్పలములన్ సంధింతుమనుట కర్థమేమో? ఇది సంధించుటవలెనే కనుపట్టుచున్నది" అనువ్రాఁతయే మీతెలివి తేటలను వెల్లడిసేయుచున్నది. అట్టిస్థితిలోనున్న మీకిది యొక్కటియేకాదు! ప్రపంచమంతయు నసందర్భముగనేయుండును. స్వల్పకా

ఉ॥ ప్రాసను నన్వితార్థకపుఁ బల్కును వేయుటయందొకంటవా
క్యాసనుఁడైన నన్నయయఖండ మహాకవి "తద్ద"నాఁగ వి
న్యాసము చేసెనంచు నొక నానుడి లోకమునందు విందుమ
భ్యాసితగాథకాళికడఁ బద్దెము నల్లఁగఁబోవ మాటలా?

ఉ॥ తిక్కనయజ్వయాదికవి తీర్థులు సైతము ప్రాసవేయుచోఁ
గక్కటితొక్కటోటఁబడు కష్టమెఱుంగమె చెప్పరాదుగా
కక్కవికోటినుంజికిలి యందపు బంగరు జాళువామలా
మక్కవితాలతాంగికిసి నంతటఁబూయుటఁ గానరాదుగా.

---

లములో నెఱవేర్పఁబడు నీయవధానమునందుఁ బృచ్ఛకులు విషమవృత్తములచేఁ గాల
క్షయము సేయనుంకింపక సంతుష్టిగలవారయియున్నచోఁ జంపకోత్పలములఁ జెప్పెద
మని దానియభిప్రాయము. దీనికై యానందమందినప్పుడు చంపకోత్పలములను జెప్పవల
యుననియు విచారమందినపుడు వేఱువృత్తములను జెప్పవలయుననియు నేలక్షణజ్ఞుఁడు
ను వ్రాసియుండనక్కఱలేదు. ఈప్రపంగ మొకపద్యరాజ్యమును జ్ఞప్తికిఁ దెచ్చుచున్నది.

శా. ప్రత్యక్షంబుగనుండి యెల్లప్రజలన్ బాలించుచున్నట్టి పుసం
రక్షింపంగొనియాడినాగమిఁక స్వర్గస్థాత్రియై కంటిచే
వీక్షింపంబడరానిదై.........

చాలు! చాలు! కడుపునిండినది. ఇఁక నుదాహరింపనక్కఱలేదు. ప్రథమకబ
ళమున మక్షికాపాతమును బుపరుక్తిద్వయమునా? యనుట కిది వేఁబొకపాదద్వయము
చేఁ బ్రచ్ఛాదితమైనది. ఎవరితప్పు వారుదిద్దుకొనుట యొకతప్పిదము గాదుగదా? అది
యటుండగాక "మ. యతియో ప్రాసయొ తప్పుచేరికిని రాదా?" అను పాణిగృహీ
తోక్తి యిఁదులకేకదా యవతరించినది! బహుగ్రంథములఁగూర్చునపు డెందేని పొరపా
టు రావచ్చును గాని పదిపద్యములు వ్రాయుచు నందులో మొదటిపద్యములో మొదటి
పాదములోఁ బ్రాసము నుఱచు నుందమతులుండరందురా? పోనిండు దానికేమి? ఈసవ
రణను వినుఁడు.

శా॥ (ర)క్షింపంగొనియాడి (నాము)కద సామ్రాజ్యంబుగై కొంచుఁ బ్ర
త్యక్షంబై మము నేలు(నాడి)పుడు దివ్యాకారయై (కంటిచే)
వీక్షింపంబడరానిదై..............,

క॥ మీపద్దెములో దోసము
చూపిన నెవ్వారితప్పు చూపించినచో
మీపద్దెములో దోసము
పాపునొసఁగ బీజమగునె? పాండితియవురా!

క॥ ఏసియోయొక కబ్బపుమును
మొదలన్ రేఫాక్షరంబు మూఁచూపంగా
డదనియెయుండెఁ జదువరుఁడు
ముదముగఁ బిడుగునకు బియ్యమునకేనొకటే.

గీ॥ అగ్నిబీజంబు రేఫతానయిననేమి?
యిట్టి దోషశతంబులెన్నేనియున్న
రక్షసేయుమటంచుఁ బ్రార్థనము సేయ
నెన్నిదోసమ్ములున్నను నెగిరిపోవె?

---

ఈపద్యము వ్రాసిన మహాకవి యెతఁడోయని యాలోచించుచున్నట్లున్నారు. ఈయన పోలవరము సంస్థానపండితుండు దివాకర్ల తిరుపతిశాస్త్రి శతావధానిగారు. పేరుతోఁ గలిపి వ్రాయకున్నచో శతావధానిబిరుదము పెట్టుకొన్న దగునేమోయని యట్లు వ్రాసినారము. వేఱొకలాగునఁ దలంపకుఁడు. ఇప్పుడో? మొలచినయట్లున్నది. పరియాచకమునకేమిగాని యీపద్యము వెనుకటిదానికన్నను దుస్థితిలోనున్నది. ప్రాసముపోయినను బునరుక్తియున్నను గొంతవఱకాపద్యమే బాగుగనున్నది. ఏమందురా? ఇది యగ్నిబీజమగు రేఫాక్షరములోఁ బ్రారంభింపఁబడినది. ఇట్టివెట్టి పిడుగుగలదా? యనినచో మేమట్టిపట్టుదలకలవారము కాము గాని; వారేతాదృశనియమసముద్రములోఁ దేలుచు మునుఁగుచున్నట్లు వ్రాసికొందురుగావ నిది యెన్నిసారమని చెప్పెదము. బాణుఁడు రేఫాక్షరమును మొదటఁ బ్రయోగించి చెడినాఁడని చెప్పుదురు. విస్తరము ప్పకవీయాదు లెఱింగింపఁగలవు. మఱియు నిందు నాలుగుతప్పులు చూపట్టుచున్నవి. అందులో నొకటి వ్యర్థమను దోషము. ఇట్టితప్పులతడకను బ్రకటించినందులకుఁ గొంకియేకాఁబోలు విశేషజ్ఞుఁడనిపించుకొనుచున్న వేంకటశాస్త్రిగారిపద్యమును దోసిరాజని కృష్ణాపత్రికలోఁ దక్కినపద్యములను మాత్రము ప్రకటించియున్నారు. ఇంతకుఁ జెప్పవ

సీ॥ *"వామనుండనిరొ ద్విత్వవిశిష్టజాతిప్ర
యికముగాఁ గ స్తనాదులకునటంచు"
నెమకి "ప్రాయో గ్రహణముచేత రక్షిత
మనుట యుక్తముగాద"టంచుఁ బలుకు
టాశ్చరమాసూత్రమం దుదాహరణంబు
పోల్చిననిట్లు వాపోవఁబోరు
"ప్రాయేణ"యనియెడు పదముంచుటకును "స్త్రీ
ణాంచక్షు"వనుచు యోజించిచూపె

గీ॥ దీనిగనినంత మీమాటదిద్దలెస్స
పదియుఁ బద్యంబులనువ్రాసి భ్రమతపడుట
కాద, యిదియొక సూత్ర మర్యాదయిందుఁ
జెడుటచూడంగ నాయంతసిగ్గుపడుదు.

---

లనినయంశ మేమన నిందు "కంటిచే వీక్షింపంబడరానిదై" యనుదాని కేమైనసర్థము గలదా? ఒకరుమాత్రము కంటితో వీక్షింపక తుంటితో వీక్షింతురా? అని శంకింపవచ్చునా? "స్తనాదీనాం ప్రాయేణద్విత్వవిశిష్టాజాతిః" అని వామనుఁడు చెప్పుచుండఁగా నీయేకవచన మెట్లుసమర్థింపఁబడునో? ప్రాయోగ్రహణముచే రక్షితమనుట యుక్తముగాదు. దీనికి జ్యేష్ఠభ్రాత బందరుశతావధానములో మఱియొకపద్యముగలదు.

చ॥ సరసుల్ కాంతలగుబ్బ చం(టిగవ)తో సాటిం గుబాలింప) న
బ్బురపుం బచ్చనినిమ్మపండు చెలఁగుక్ మోదానుసంధాయియై

ఇందుఁ గుబ్బచంటికవతో నొకనిమ్మపండుపమింపఁబడినది. వేయివేలుగ నన్నయింతురుకాఁబోలు! అతివృష్టియో యనావృష్టియో యేలచేయవలయును? ప్రాచీనకవులుసైత మట్లుచెప్పినవారుకారు.

క॥ "ఇంతలు బదరీఫలములు। ఇంతలుమారేడుపండు, లీడుకజోడౌ
బంతులు, తామరమొగ్గలు। దంతికుంభములఁబోలు తరుణీకుచముల్"॥

---

*"స్తనాదీనాం ప్రాయేణద్విత్వావిష్టాజాతిః"--ప్రాయేణకిమ్--"స్త్రీణాంచక్షుః కావ్యాలంకార సూత్రాణి.

మ॥ పదిపద్యంబులు వ్రాయుచో మొదటిదౌపద్యంబునందందుము
మ్మొదలౌ పాదములోనఁ బ్రాసమటుపుంబొందంగమందాత్ములుం
డుదురాయంచవహేలచేసిరిరి విద్ధూరంబుసూత్రంబులో
నెదురై కన్పడుఁగంటికిద్ది తమకిట్టింకిం కెనే జంకునన్.
శా॥ ఈరీతిందలపోయఁగూడదు కళాహిందోళనాందోళితుల్
మీరల్ భాష్యవిదుల్ కనంబడనివ్యాళీలల్ వెలింబెట్టు వా
గ్ధీరుల్ పండితులిట్టియీతమకు నేకీభూతయోగంబు నిం
డారంగన్గానుమాత్ర కాలమదిలేదా స్థానికుల్ కావుటన్.
మ॥ పయికిం గన్పడుదానికిన్మదముగూర్పన్ లేక ప్రచ్ఛాదితం
బయియున్నట్టియుఁ బేలికె త్తికనియందానందముంగొంతఁబొం
దియు నామాత్రనదృప్తతీరకసమర్థింపన్ బసల్లేక వ
న్నెయు వాసింగనువారికెందెవరౌకో నేర్పంగలర్నీతులన్.
గీ॥ కన్నుదోయికి మఱియును జన్నుగవకు
నొక్కయుపమాన వస్తువునుంచి సాటి
చెప్పి చుతిఁగన్నయట్టి ప్రాచీనకవుల
విమతమైన ప్రయోగముల్ వేనవేలు.
ఉ॥ దంపుడుపాటపాడెదరు తప్పకయొప్పుడునంతసూ గుబా
ళింపనవంగ నిందులవలేశము దోషములేదు మ్రుగ్గులో

సరసులగు కవులుగాని యట్లుపోల్పలేరఁట! వారు తిరుపతివేంకటేశ్వరులేకాఁ బోలు! హా! హా! హా! ఎంతసగసులు! హా! హా! హా! హా! ఏమిసరసతిరుపతివేంకటేశ కవులు!

మఱియు నిందు « చంటిగవ » యనుచో గకారాదేశ మజ్ఞానమూలకము. చనుంగవలో గకారముండఁగా నిందేలయుండరాదని వ్రాసినట్లున్నారు. 2 « గుబాళించు » ప్రకృతార్థము రాక చెడినది. మఱియొకలాగున నన్వయించినచోఁ బ్రక్రమభంగమగును.

దింపఁగ నీయదర్థమని తెల్పక పోవుట పాడిగాదు "ఘో
షింపుట" దీనికర్థమని సిద్ధములౌ తెలిసికొంబు చూడుఁడీ!

ఉ॥ డంబముగొట్టవచ్చును హడావిడిచేయనువచ్చుఁగాని బిం
కంబునునిల్పుకొంగఁగడుఁగష్టము ధారణతోడనిర్విశే
షంబుగనిర్వహించు సరసంబయియొప్పు శతావధానకా
ర్యంబదియేడ! హస్తిమశకాంతరభేదముకాదె యెన్నఁగన్.

గీ॥ భాష్యవేత్తలు మీరలు పలుకుపలుకు
లకును నర్థము తెలియఁగ లమె నిజముగ
నిప్పుడొప్పరికించుట యెంచ వెనుక
యూహాయయ్యదియేక దే శ్యుక్తియే మొ.

ఉ॥ గొప్పఁగ రాజసత్తములు కోరినపద్యము లేక్రమంబునుం
దప్పక చెప్పువారలటు "ధారణమాటయటుండనిచ్చి యం"
చిప్పగిదిన్ లిఖింపఁగను నేల? పరస్పరభేదవాక్యముల్
తొప్పలు దోరలెక్కువలు గొంబదితొమ్మిది కుప్ప తెప్పలున్.

క॥ మూలస్థానేశ్వరశతి
మూలస్థానేశ్వరమసి మూలుగనేలా!

---

అవధానమైనపుడు పద్యములన్నియుఁ జదువక శ్రీవారుకోరినవిమాత్రమే చదువుటెటువంటిది. అని యింకొకచొప్పదంటు శంకయాచార్యులవారికిఁ దోఁచినది. ఈయవధానము నాలుగుగంటలలోఁ జేసినదిగాని నాలుగు మూఁడురోజులు గుంటరువ్వులు వేసి వల్లించియుఁ గడకుబప్పులోనడుగు వేయుఁచుండువారి యవధానములవంటిది గాదని మాయాచార్యలూహించుకొందురు గాక! ధారణమాట యటుండనిచ్చి యింత స్వల్పకాలములోఁ దిరుపతివెంకటకవులు నూఱుపద్యములనైనను జెప్పినట్లు కనుపట్టదు. మూలస్థానేశ్వరశతకము మూలస్థానేశ్వరశతకమే. అట్టియెడ మేము నాలుగుగంటలలో నవధానము ముగించి శ్రీవారుగోరినపద్యములనైనఁ జదివితిమిచాలదా? మేము చెటి యొక పాదమును జెప్పుచుఁ బదిగంటలలో నొనర్చిన పటియొక సంపూర్ణావధాన మీగ్రంథమాలయందే ప్రకటింపఁబడియున్నది. దానినిగూడఁ జూచి మీ వెఱ్ఱినడంచుకొనుఁడు

చాలుంజాలును బాండితి
నాలుగుగంటలకుఁ జేసినారఁట భళిరా!

చ॥ కనమతిశక్తిమైని బదిగంటలకాలములోన మేము ని
ర్వ్యారమును నిర్వహించితిమిపో! యని వ్రాసితిరట్లుచేయుటె
సరియగుచో మఱొక్కపరిసల్పుఁడి యచ్చటికాగితంబులన్
బొరిఁబొరి నింటికింగొనుచుఁ బోవక వర్ణనచేయుకొంతయున్.

ఉ॥ మా కెటనుండియొకడునమానుషరీతినిగమ్మ్రయొందుతాఁ
ప్రాకటరీతివచ్చెనని వ్రాసితిరిందును బూతులెన్ని వే
లోకను బట్టఁజేసితిరలో! పెఱవారల నెత్తిఁబెట్టనే
లా! కరమూనితొమ్మిదవయక్షముయొకరుపీరుపెట్టరే.

---

రాజకార్యధురంధరులును, ప్రకృతిసుకుమారుఁడగు నృపశిఖామణియుఁ దిలకిం చుటకయి స్వల్పకాలములో నవధానముఁ జేయుటలంపుతో "సీసము మొదలగు పెద్దపద్యములనుగోరి కాలక్షేపము సేయవలద" ని పృచ్ఛకులతోఁ జెప్పుటదక్కఁ దక్కినవిషయములయందు వారివారియిష్టము ననుసరించియే నుడివితిమి. కావుననే "పృచ్ఛకులు గోరినరీతి" నని వ్రాసియున్నారము.

కవిరాజవిరాజితము తోవకము మున్నగునవి యిందుఁ గొన్నివృత్తములే కలవనియుఁ దక్కినవి సామాన్యపద్యములనియు మీయాక్షేపము.

సామాన్యపద్యములనఁగానేమి? శార్దూలము, మత్తేభము, ఉత్పలమాల, చంపకమాల మున్నగునవి వృత్తములుగావా? తఱచుగాఁ గవులు వాడినంతమాత్ర వానికి వృత్తత్వహానిలేదు. అవి కందగీతములవలె జాత్యుపజాతులలోఁ జేరినవిగావు. వానిని గూడ లెక్కించుకొని చూచికొనుఁడు. అట్లుగానిచోఁ దిరుపతి వేంకటకవులు దీర్ఘావకాశముఁ గైకొని యొనరించిన యవధానాభ్యాసములనుసైతము మీఱాయి తగులకమానదు. వారి బందరుశతావధానమును గుఱించిన యీలేఖార్థమును జదివిచూడుఁడు.

"అవధానకాలమునందు అడిగినవిషయమునకుఁ గొంచెముఇంచుమించుగాఁ దోఁచినవిషయముమాత్రమే చెప్పిరి. చెప్పినవిషయములకుఁ దగిన హెడ్డింగులు పెట్టి యచ్చువేసినారు. యథార్థముగా నవి యన్నియు నేవియో చెప్పుటకుఁ గాలయాపనను బట్టి మఱి

సీ॥ పదిమందిపెద్దలు పదఁపడియందఱే
కగ్రీవముగ బల్కఁగలిగి రేని
అలజడిచచ్చిచేయంగల విన్నప
ములుగాఁగ నవధానమలరె నేని
తిరుపతి వేంకటేశ్వరుల గెల్చెదమని
దండిగా పైసిమీకుండె నేని
ఏయభిజ్ఞుఁడో మీకుసీరీతిగాఁ గమ్మ
వాస్తవమ్ముగఁ దానవ్రాసెనేని

గీ॥ అట్టిమేధావిపేరు పైఁబెట్టరాదె
గెల్చెదమఁటనియహమున్న గెల్వరాదె
అందఱకుఁ దెలిసిన రహస్యంబిదికద
కార్యశూరులుకారాదె కాఱులేల!

---

పుదగిలినది...మీ పేరెత్తిన నాయనబట్టయీాడునట్లు గంతులువైచుచు 9 అట్టముయా కరువుపెట్టును...ఈశతావధానము 9 దినముల దీర్ఘావకాశముఁ కైకొనిచేసినదైనను గంటలలెక్కను మీరుచేయునట్టి యవధానమందు శతాంశమంతయైనను రసవంతముగా నుండి శతగుణితముగా దోషయుక్తమయినదని పెద్దమనుష్యులందఱును ఏకగ్రీవముగా ననుచున్నారు

“ మొదటి 50 చరణములును రెండవ 50 లోని రెండవచరణములలోఁ గొన్ని యును మాత్రము వెం. శా. గారు చెప్పిరి. తక్కినవన్నియు తి- శా- గారివే వెం-శా- గారు పూర్వపు నానారాజసందర్భపద్యములఁ జదువుచుఁ గాలక్షేపముచేసిరి ” --

వీరియవధానప్రక్రియ దెలిసినదా? మాకిరువురకు భేదములేదని తి. శా. గారిని ముందునకుఁద్రోసి వెం. శా. గారు వెనుకటిపద్యములఁజదివి యంగఁగఁజేయుచు నట్లో “ చేయంగలవిన్నపములుగా ” నవధానమునీడ్చి మఱికొన్ని నాళ్ళకుఁ గొన్ని పద్యములు చేర్చియు మఱికొన్ని మార్చియు నొక యపూర్వగ్రంథమును బ్రకటింతురు. “ తెల్లనివన్నియుఁ బాలు నల్లనివన్నియు నీళ్ళు ” నని తలంచునుట్టాలుపిల్లలు కొందఱును, బహ

ఉ॥ ఊటఁకుమమ్మ! యింతకునయోగ్యులుతిర్పతి వేంకటేశ్వరుల్
కాటియఁ బెట్టినారు కసుగందులునైనను రామకృష్ణులే
వీటికులై కవీశ్వరుల వెట్టికిఁ గొట్టి ముదంబునీకుఁ జే
కూఱఁగఁ జేయువారలదిగోఁ గనుగొమ్మ శతావధానమా!

శా॥ క్రోఁతింద్రిప్పినయట్లు త్రిప్పిరినినుంగుక్షింభరిత్వంబునన్
లాంతుల్ కొందఱు వారిమాటలికనేలా! రామకృష్ణాహ్వయుల్
భ్రాంతింబాజరమందుఁ జిల్క గతి మర్యాదంగనుంగూర్తురీ
చేఁతల్ లేఁబారకాయకోఁతలని సంశీలింబడంబోవుమీ!

శా॥ ఊడంబోరు కవిప్రకాండులెవరే యోజింపనీమాత్రపుం
గండల్ సత్కవితాభిరాములు కళాకప్రాకృతుల్ పాండితీ
శౌండుల్ నూతనదివ్యసద్బిరుదభాస్వత్కీర్తు లంచంచునుం
దండూరా తెగఁగొట్టుఁడింక నవధానజ్ఞానవిజ్ఞుల్ బుధుల్.

---

తుమునందలి వారును, జంకలు తాటించుకొనుటయే వారికిఁ బరమానందము. వీరిన్ని లావాదేవీలుపడినను యథార్థజ్ఞుల యభిప్రాయ మెట్లున్నదో! శతావధానమా! యూఱడిలుము!—

శా॥ చేతఃప్రీతిఁ బురాతనుల్ కవివరుల్ సృష్టించి పోషింప వి
ఖ్యాతుల్ దేవులపల్లిసోదరులు నివ్వాస్థానికెక్కింప న
య్యో! తర్వాతను గాకవీశ్వరులు మాయోపాయము లింటింటికిం
గ్రోఁతిం ద్రిప్పినయట్లు త్రిప్పిరి నినున్ గుక్షింభరిత్వమ్మునన్.

దైవవశమున నాదుర్దినములెల్లఁ గడచనినవి—

శా॥ ప్రీతిన్ దేవులపల్లిసోదరులు సుశ్రీమించు నాస్థాని నే
భాతిన్ నీకు యశఃప్రసూనమిడిరా ప్రాంద్రోవ నారాయణా
ద్వైతిచ్ఛాత్రులు రామకృష్ణులు మహత్త్వంబిచ్చి నీకెంతయున్
ఖ్యాతింగూర్తురు దిక్కటాహముల నింకం జింతనీకేటికిన్,

మ॥ అదె కాంబోలును నిన్న నెల్లరకు నూహింజేయలేనంత జో
కదలిర్పంగను బ్రోంకబ్రోసెనఁ టవాఘుంటాపథంబాదుఁదా
మిదమిత్థంబని చెప్పఁగాఁ దెలియులేరెవ్వారలుంగాని బి
ట్టుదయాదెల్పెను "నట్టహాస" మదెదండూ రాయటాపొప్పుగన్.

శా॥ సింగారంబుగ రెంసుపద్దెములచేఁ జేతఃప్రియాభ్యూహాస
ర్వాంగీణావయవాభివృత్తియగు నశ్లీలాత్మస్తుతిం జేసికో
నంగీకారమె కాని యట్లగుకురా! యుందెంచు మన్నాము మేల్
సంగీతాలకుఁ బంతకాయులవి రాలంబోలు నేయెన్నఁ జేన్.

సీ॥ ఒకశబ్దమున కేది ప్రవృత్తి తెలియని
యెమ్మెలగు పదేష్టకొంతదవ్వ
వికకలిమూటమాంటనువదింపఁగ లేని
యెఱుకు వకవధాన మేడ కేడ
మొగమోటమాగలుంచి బూమెలాడుకొనెడి
నింత వారికివిద్దె యేమివరుస
ఎకుసైన వాన్ప్రఁక రనెల్ల దూటెడివారి
కీహితంబగునీతి కేమివావి

ఆ॥ తమవిధంబుఁ దెలిసి తమ్ముదెలిసియు
నిసముమీఁద నెఱులు కసిమసంగ
డంగుకలువ తేని డాకాలఁదన్నంగ
నరయుచున్న వార లక్కటకట!

---

తోవకవృత్తమునుగుఱించి మీరువ్రాసిన పంక్తులు:—

"తోవకవృత్త మప్పకవీయమున నెచ్చటను లేదు. అందుఁ దామరసవృత్తమును నామాంతరముగల తోదకవృత్త మొకటి కలదుగాని యది గతిచే దీనికిసరిపడినను నీగణములు కలదిగాదు కావున నీవృత్తముగూడ నూతనసృష్టియని యూహింపనయ్యెడిని"

గీ॥ భారతమున సుదక్షిణా పరిణయమునఁ
బ్రోదిఁగాఁగూర్చు తోటకదోదకముల
వృత్తములు సత్ప్రయోగంబులిచ్చినార
లున్న దానికి సంతోషమూనవలదె.

---

ఈవ్రాఁతవలన నప్పకవీయము గాని వృత్తము చెప్పఁగూడదనియు నప్పకవి చెప్పిన వృత్తమే పురాతనస్పృష్టమనియుఁ దేలుచున్నది. అగుఁగాక! ఇహి! హీ! ఇట్టిపిచ్చికం కలకెల్ల మేము సమాధానము చెప్పవలయునా? మీరే మఱియొకసెలకఁ గన్నులువిప్పకొని యిట్లు తెలిసికొంటిరి:—

"ఛందోవిషయమునఁ బ్రౌఢగ్రంథ మప్పకవీయముగాని సులక్షణసారము కాదు. లక్షణసారముయొక్క యసారతనుగూర్చి యిటువ్రాయుట యప్రస్తుతము. అందెన్నో తెలివితక్కువలు కలవు. తోవకమును వీరితరలయు నప్పకవిమతమున దోదకమును విచికిలితయు నగుచున్నవి. నామాంతరసద్భావమునకుఁగూడ నతనిసమ్మతిలేదు. ఉన్నవానికిఁ జూపుచు నేయున్నాఁడు. ఈవృత్తద్వయమునకు భారతాదిప్రమాణముగూడ మృగ్యము. తోవక మించుక భేదముతో నామసామ్యముగలదియే యైనను వీరితరలకు లక్షణసార మాధారము కావలయునే కాని యప్పకవీయము బొత్తిగా సంబంధింపదు"

అప్పకవి యొకానొకచో లక్షణసారోక్తి నంగీరింపమిఁ గని "మగఁడుగొట్టిన మధుకరపువాఁడును గొట్టె" ననుసామెతగా మీయకూడ నందెన్నో తెలివితక్కువలు గలవని యాక్షేపించితిరి. కానిండు. తోవకవృత్తము మొదట నప్పకవీయమునందు లేదనుకొని యప్పకవీయమే సర్వప్రమాణమనియు నది యిందులేదనియు నధిక్షేపించితిరి. పిమ్మట నదియే నామాంతరముతో నున్నట్లు గ్రహించి క్రిందఁబడినను మీఁదఁబడినవాఁడనే యని నామాంతరమునకై యిప్పుడు పెనఁగులాడుచుంటిరి. వినుండు.

"ధోధకవృత్త మిదం భభభాగా" అని వృత్తరత్నాకరము. ఇది సర్వసంస్కృత కవిసమ్మతము. దీని నప్పకవి దోదకవృత్తమని వ్రాసినాఁడు. మీరు నట్లే గ్రహించితిరిగదా? లక్షణసారవేత్త తోవకమని చెప్పెను. మఱియొకచోఁ దోటకమనికలదు. వేఱొకఁడు తోదకమనియెను. ఇందఱిలో నప్పకవియే విశిష్టుఁడా? అట్లే తరలయు శ్లాఘ్యమైనది. మీయప్పయు విచికిలితమను మాఱుపేరు నొప్పకొనియేయున్నాఁడు.

క॥ "కామాంబా"యనుశ్లోకము
నేమముతప్పినదె ద్వంద్వనిష్ఠపదంబుల్
నోము నెయన్వయమింకొక
సామాసికపృథగనర్థ శబ్దముఁ బొందన్.

శా॥ "ఆద్యస్త్రోటకితో" యన గంబఁభాషానంసికహాసూత్రము
దాద్యాహీశ్వరుఁడెట్లు ... సెవల శాస్త్రంబుఁ దద్భాష్యకృత్
ఖద్యోతోక్తి యథావమన్మిత తాత్పర్యంబు పస్పష్టచో
సద్యంబెయిదితప్పటంచ ... కాశాసింప కేమీరతే.

సీ॥ *అలభాష్యమందు "నజావిధనౌ" యను
సవిశేషణమొక "దేవదత్త
యజ్ఞదత్తౌ" యననలరు ద్వంద్వమునకుఁ
దార్చ్చినయెడ నజాధనమెవరిదను

---

ఆప్పకవియెటులంగని పాఠాంతరములు గలవు. మా. సువృత్తతిలకము. ఇందు వీనిఁ
బ్రయోగము చూపవలసియున్నది.

తోటకవృత్తము. దేవకృతంబులు ధీరులకైనన్, భూవరమాన్యులఁ బోలునె యెట్లుం
గావున శోకము గాదు నవాంగం, గావల దేమతి గౌరవమొప్పన్.

ఇది యానందముద్రాక్షరశాలా ముద్రిత భారతప్రయోగము. ఆదిప్రయోగముఁ
గూడఁ జూపుదుమా?

తోదకవృ॥ నాగయు పోదజ నప్రభుఁ బోలిన్, నాగమయాళిలల నామణియందున్
రాగముతోఁ జన రానగఁ గాంచెన్, రాగవతీరతి రాజసమానున్.

సుదక్షిణాపరిణయము.

శ్లో॥ కామాంబా సూరాంబే నారాయణశాస్త్రి రామచంద్రబుధౌ
మాతరపితరౌ తు(ద్విర్వచనార్థకః) యయోస్తౌ, వేంకటరామ రామకృష్ణకవీ.

---

*"సమాసనిర్దేశో ఽయం తత్రన జ్ఞాయతే క ఆఢ్యో ఽస్తి ఇతి। తద్యథా। అజావిధనా దేవదత్త యజ్ఞదత్తావిత్యుక్తే, తత్రన జ్ఞాయతే, కస్యాజాధనం కస్యావయ ఇతి। యద్యపి

యవిభజనమెవరిదో యనివిభాగంబుగాఁ
తెలియఁగాఁబడదంచు ఁగలద మఱియు
నిదిలోకదృష్టాంతమే యనియును వ్రాసి
ప్రకృతసూత్రమునద్వంద్వమునకన్వ.

ఆ॥ యంబుసిగ్గు చెప్పెవలఫు ఁకలోకదృ
ష్టాంతమునకుసూత్రచాఁటనంబు
తగపవర్తకముయథాసంఖ్యసూత్రంబు
కలదుగానయర్థ కలితమంచు.

క॥ *నాగేశభట్టు కూడఁ బ్ర
యోగమిది యసాధువంచు యోజించిమహా
భాగుఁడు వ్యాఖ్యానంబున
నీగతి యేయనుసరించి యెఱుకడచేసెన్

---

వేంకటరామకవికిఁ గామాంబా నారాయణశాస్త్రులు తల్లిదండ్రులనియు, రామకృష్ణకవికి సూరాంబా రామచంద్ర బుధులు తల్లిదండ్రులనియుఁ, బ్రథమకర్త్యంజదువు విద్యార్థులుసైతమీశ్లోకమును సక్రమముగా నర్థముచేసికొనఁగలరు. అప్రస్తుతపురావీణమును గీరతప్రయోగములను బట్టి యన్వయము చేసికొనవలసిన దుస్థితి యింకను రాలేదు. లింగ వచనవిభక్తిజ్ఞానము లేక యపార్థములు చెప్పఁజూచువారి కవమర్యాదయే గాని శాస్త్రిమర్యాద యక్కఱలేదు. మేము గ్రంథాంతగద్యములందు శాస్త్రి

---

తావత్ లోకఏవదృష్టాంతః। దృష్టాంతస్యాపి పురుషారంభోనివర్తకోభవతి। అస్తిచేహకశ్చిత్పురుషారంభః। అస్తీత్యాహ। కః। సంఖ్యాతానుదేశోనామ ఇతి॥ «ఆద్యన్త సూత్రభాష్యే»

---

* యద్యప్యత్రమిలితస్య నైకత్రాన్వయఇతిద్వంద్వో న ప్రాప్నోతి। తథాపిసమూహారూఢాన్వయబోధోత్తరం యథాసంఖ్యమితి సూత్రారంభసామర్థ్యాత్పునః ప్రత్యేకాన్వయః లోకేత్వేవంరీత్యా ప్రయోగోఽసాధురేవేతిభాష్యేస్పష్టం «శేఖ.రే»

మ॥ *విషమిూకారుఁడుద్వంద్వగర్భితబహువ్రీహ్యర్థమాద్వంద్వతా
విషయార్థంబునకన్వయింపదని తెల్పెన్ భాష్యసారస్యమీ
విషయంబుండఁగ విశ్వనాథబుధుఁడొప్పెంద్వంద్వముంద్వంద్వతా
విషయార్థంబున కన్వయించునని స్వప్రీతిన్ విడంబించుచున్

క॥ జాతినివచింతుమంచును
నూతనమగు నొండు త్రోవనుంబట్టినచో
బూతగును దెలివుతక్కువ
యే తెలియునుగాన చెప్ప నేలా! వితగన్.

ఆ॥ వీరుసూచినట్టి విషయమే కాదు మీ
రూని చెప్పఁగల ప్రయోగమిదియుఁ
దరలిపోవవలయు ద్వంద్వైక దేశస్థ
పదములకును వేఱుపథముగాఁగ.

---

బిరుదముల నామముల తుదఁ దగిల్చికొంటి మంటిరి. నిజమే మేము మొన్నటివారము గాన మొన్నటినుండియే పెట్టుకొనినారము. ఇక్ష్వాకులనాఁటి వృద్ధకవులప్పటినుండి యుఁ దగిలించుకొన్నారు. అభిజనమునందుఁ దిరుపతయ్యగారని పిలువంబడు మొదటికవి తిరుపతిశాస్త్రిగారు కాలేదా? వేంకటాచల మనంబడు రెండవకవి వేంకటశాస్త్రిగా ను, వెరసిమైనపుడు వేంకటేశ్వరుఁడు గాను మాఱలేదా? వారివలె శ్రీకింకవీంద్రఘటే త్యాది సర్వాబద్ధబిరుద మేదోయొకటి పెద్దాపురము చేద తాడంతపాడవుగా మేము ప్రతిగ్రంథమునందున వ్రాసికొనుచుండుట లేదు. పైసంస్కృతశ్లోక మాంధ్రము నదు మ నన్వయింప దనుట యజ్ఞానవిలసితము.

---

*తథాచ, తీర్థదగ్ధాబ్ధిలంకః" ఇతిప్రయోగోఽసాధురితి కేచిత్। అస్త్యేత్వత్రాజా విధనా దేవదత్తయజ్ఞదత్తావిత్యుక్తేర్నజ్ఞాయతే కస్యాబాధనం కస్యావయ ఇతిభాష్య స్వరసాత్। ద్వంద్వగర్భబహువ్రీహ్యర్థస్య సమూహస్య ద్వంద్వాగ్రసమూహేన, అన్వ యోత్తరం నప్రత్యేకమన్వయః। పరస్యద్వంద్వార్థయోస్తుప్రత్యేకమన్వయో భవత్యేవే త్యాహు॥ "విషమి"

క॥ ద్వంద్వసమాససమూహము
ద్వంద్వద్వంద్వైకదేశవాస్తవ్యపద
ద్వంద్వపదాన్వయ మెటుఫ్రెం
దుంద్వాదృశులకె యదియును దోఁపక వలయుఁ.

ఉ॥ ద్విర్వచనార్థకంబనుచుఁ దెల్లముగాలిఖియించినారలే
గుర్వవరోధమీపలుకు గూర్చెడునెందును ద్వంద్వమిప్పుడే
నిర్వరఁగూర్చి చెప్పఁగద, యింకొకభావము, యేకశేషగా
నిర్వహణంబుచేయ ధరణింగొని తేవలెఁ గ్రొత్తసూత్రముఁ.

ఆ॥ వెట్టిశంక జేసి విసిగింపఁబోము ప్ర
త్యుత్తరంబు చెప్పనోటు! మీాజ
వాబుచూడఁ గానవాబుదర్బారుద
ర్బారుకవివరేణ్యు లీరలగుట

---

అత ఏవోక్తం వికృతివివేకే „ప్రబంధకేవలాద్యస్య ప్రయోగస్తున దోషకృ"
దితి

సీ. దంభోళిధరసతీ ♦ తాంబూలపేటీషు
దహనబింబాధరా ♦ స్తనభరేషు

శ్లో. హరయే జితమురుదరయే... దేవాయనమః" ఇద్యాది ప్రయోగాః ప్రబంధేషు బ
హవః ప్రవర్తంతే. కించ. తత్రైవ " వినానుకరణంకేచిదాద్యశబ్దప్రయుంజతే „

అని "అనుకృతేస్తినాక్యంగు" అను సూత్రమునకు వ్యాఖ్యానముఁజేయుచు న
ముఁజేయుచు నహోబలపండితుఁడు చెప్పినాఁడు. దీని పిండితార్థమది—అనుకరణస
హితమైనను గాకున్న సమర్థమగు సంస్కృతపద సముదాయ మాంధ్రమునఁ బ్రయోగిం
ప వచ్చును. అనుకరణరహితమగు కేవలపదమును బ్రయోగించునప్పుడు శ్రవ్యతఁ నపే
క్షింపవలయును. కావుననే విశాంపతులు మున్నగు తిరుపతివేంకటకవుల ప్రయోగ
ములు మీారు వ్రాసిన "అహంతావ దీసభలో కేనచిత్కారణేన (స్వస్కూలుపిల్లలుత్వే

క॥ ఇత్యాదులంచు నెటులో
ప్రత్యుత్తరమిచ్చురీతి పరికింపంగా
నత్యుత్తమమగుమార్గము
ప్రత్యక్షప్రమితిచూప రాదో కో యున్నక.

క॥ ఎంచుచునర్థరి శబ్దరి
యంచుఁ బ్రయోగించినాఁడవగు నేయనయో
జించియుఁగర్తరిభర్తరి
యంచుఁ బ్రయోగంబు లిచ్చెనంటబళీరే!

---

న) ఆకింతయు జంకులేక కానిచిత్పద్యాని చెప్పగలను'' అను దానివలెఁ బరిహాసపాత్రములు. ఈప్రసంగమునం దనవసరముగా "ఒక కవి పదునైదవాబ్దంబు, అని ప్రయోగించె. ఆగ్రంథమునకు నద్భుత బిరుదము మాత్రము కలదు" అని యద్భుతోత్తర రామాయణమునందలి "సీ. పదియైదవాబ్దంబు మొదలుగాఁగవినయి" అనుపద్యమును బురస్కరించుకొని నాదెళ్ళ పురుషోత్తమకవి గారి నాక్షేపించితిరి. అది ముద్రాప్రమాదము. శుద్ధపత్రికయందలి "21 వాబ్ద. వబ్ద'' అను సవరణను జూడక యాక్షేపించుట శ్రేయస్కరము గాదు. అట్టివి మీకుఁగావలసినచో "వేదసంతలు'' మున్నగు తి॥ వే॥ ప్రయోగములులేవా?

"రత్నాకరభామినులకు'' అని కోమటి, స్త్రీలను నర్థమునఁ బ్రయోగించియున్నారు. రత్నాకరశబ్దమునకుఁ గోమటులచునర్థ మేశాస్త్రమువలన వచ్చునో?'' ఏశాస్త్రమువలన రాదో?

"వందితబుధజనలోకం'' ఇందు "వందిత'' యనుచో నేదో వెజ్జిత్రోవఁదొక్కనగును గాని యదియు నిల్వదు''

ఆతప్పేదియో వ్రాయరాదా? నిల్చునో నిల్వదో తెలిసికొనవచ్చును "తనకుఁ దెలియనివన్నియుఁ దప్పులనుచుఁ గుకవిహాస్యంబు గావించు''

విద్యా! వద్యా! అనఁగాఁ బండితులుగలవాఁడా! యనియర్థము.
విద్యావతః యాతి. ఆతోసుపసర్గేకః. కృదంతము తద్ధితాంతగర్భము.
"ప్రజ్ఞాశూరా'' యనునది కార్యశూర ఖడ్గశూరాదులవంటిది.

గీ॥ బూతులాడుపదము ప్రాగడపుటయందు ని
రూఢమగునుగాక రోచకంబు
దోఁప జేయుచుండెఁ దొవలరాయనిబూతు
లాడుచుండెననఁగ నన్నలార!

---

ఇట్టి వెట్టిశంకలు సేసి విసిగింపక యీశ్లోకముఁ బఠించుకొనుఁడు. పై మీసందేహములు మంచువిడినట్లు విడిపోవును.

శ్లో॥ శక్తిగ్రహం వ్యాకరణోపమాన కోశాప్త వాక్యాద్వ్యవహారతశ్చ
వాక్యస్య శేషాద్వివృతేర్వదంతి సాన్నిధ్యతస్సిద్ధపదస్యవృద్ధాః.

"పూర్ణశశితోడ సెమ్మోము బూతులాడు" ఇట బూతులాడు-అతిశయోక్తులుపలుకును గావున నే వంది "బూతు" అనఁబడుచున్నాఁడు.

భారతమునందు.

ఆ.గీ. బూతువొగడినట్లు పొగడెదుపొగడంగ, వలయునేని సుగుణవంతులైనఁ
గర్ణశల్యులాది గాఁగలవీరులఁ, బొగడుచుండరాదె ప్రొద్దుపోవ.
"బూమెలాడు" అనియుం బాఠాంతరము.

ఉ. తొల్లిటి సత్కవీశ్వరులు ద్రొక్కినదారులఁదక్క మాఱుగా
వెళ్లిననొప్ప రీనియమవేదులు వారలదారిఁజేరఁగా
సెల్లరుఁ "గోడిగ్రుడ్డులకు నీఁకలఁబీఁకెడువారె" నవ్వులో
చెల్ల! యిఁకం బ్రబంధములఁజేయుట యెట్లులొ చెప్పఁడీ బుధుల్.

ఇందలి సామెత లోకప్రసిద్ధమైనది. "ఈఁక" శబ్దమున కపార్థములేదు.(ఈఁక-పక్షిరెక్క) కావున నించుకయు నశ్లీలాపాదకముగాని ఈసామెతతో నేక దేశమును గ్రహించి పలుచోట్ల "నిది యీఁకలఁబీఁకు పాకమా" యని ముదలకించుట యేమిరమణీయము?

ఇట నశ్లీలార్థదాయకములగు దుష్పాకములఁ గొన్నింటి మీకుఁదెలుపుట యప్రస్తుతముగాదు:—

(1) "నిక్కినామ" పాకము. నా॥ సంద॥ 58 పుట.

ఇది యాత్మవిశేషణమై తప్పక యనౌచిత్యముఁ జేయుచున్నది. అన్యత్రప్రయుక్తమైనచో నీదోషముగలుగదు. "నిక్కిన కాకవుల్ ఘరంబోలరు సత్కవీశ్వరుల"

సీ॥ తొలినుండి తనకువిద్దెలఁజెప్పు నొజ్జను
　　　　బోరిఁబోరి దరిఁజేరిబూతులాడె
ప్రవరాఖ్యుఁడువిశాల వనివరూధినిగోర
　　　　మాఱాడకయె మేరమీఱిత్రోబ్బె
పోటుబంటయ్యును బాలసుదిండినిగాంచి
　　　　యంగవించుచుఁ గాలుపంగళించె
తెలవారుపట్లమొ కట్టెలముగాగుహ్యాప్ర
　　　　దేశమ్మునంగడు నాశనొందె
గీ॥ ననిప్రయోగింప నిందుదొప్పమ్ములేదు
　కానివాఁడుకయందు హాస్యానకమరుఁ
　గానయిట్టిప్రయోగంబులూని చెప్ప
　నేలయోబూతులాడుకో నేలయయ్య!

---

(2) ‹‹ భాంచోద్ధలంకోరు ›› పాకము. 1911 సం॥ డిసెంబరునెల సరస్వతీ సంచిక.

ఈపదములకర్థ మాబాలగోపాలము నెఱింగినదియే. అనుకరణమందేని ఇట్టి అపభాషితములఁ జేర్పరాదు. లజ్జనువిడిచి త్రిలోకీ విజయము సేయువార లిదిపాటింపకపోవుదురు గాక!

మేమవధానమునఁ గోహినూరువజ్రమును వర్ణించుచుఁ బరిమాణమున దానిని నింబముతో నుపమించితిమి. మీ రానింబశబ్దమునకు వేపకాయ యనునర్థముఁజేసికొని కోహినూరువజ్రమునకు వెట్టివేపకాయతో సామ్యమెట్లుకుదురునని యాక్షేపించుటయేగాక ‹‹ నింబమంటే నిమ్మకాయ. ఆవజ్రము కోడిగ్రుడ్డంతయుండునని కొందఱువ్రాసియున్నారు. వీరు దానింబట్టి చెప్పియున్నారు. నింబశబ్దమునుండియే నిమ్మపుట్టినదని కవులయాశయము. ఆంబనుండి యమపుట్టలేదా? ›› అని మాయభిప్రాయమును వర్ణించియు విదూషకముఖమున ‹‹ నిమ్మయనునది తద్భవముగాదు. దేశ్యము ›› అని నిర్ధారించితిరి. ఆహా! ఏమిపరిజ్ఞానము? ఇటుచూడుఁడు:— ‹‹ లకుచోలికుచో నింబోదహూర్జంబీర నామకః॥ స్యుర్జంబీరేదంతశఠ జంభజంబీరజంభలాః ›› అభిధానరత్నమాల. 28 పుట. సం

ఉ॥ భావవిరోధమైన పలుపల్కులు "లజ్జనువీడియుంద్రిలో
కీవిజయంబుసేయు"నని కేరడమాడుట కెందునిష్కృతుల్
లేవిటులెవ్వఁడేని సవలీలగనుజ్జఁదృణీకరింపఁగ
వ్యావళియెల్లనింతగని యక్కట! యేమనువారలో కదా!

గీ॥ వమ్మనకునర్థమును బాగ వ్రాసినార
న్యాయమును నెవ్వరేనియు నరయుకుండె
మీరలిచ్చు ప్రయోగమ్మెలే రచించె
నఖిలపూజ్యంబు శబ్దరత్నాకరంబు.

గీ॥ ఈప్రయోగాల జేసి మీ కేమిఫలము
నాపనుపరిశ్రమమెల్ల నాశమాయె
ననఁగ సాఫల్యమబ్బెనే! యోర! "పంచ
పాండవులు కోళ్ల సామెత" వలెనెనుండె.

---

స్కృతము. «నింబః» కన్నడము. «నింబే» తెలుఁగు. «నిమ్మ» అని యుఁడలియను క్రమణిక దేశ్యమనుట ప్రామాదికము.

మాపడినశ్రమంబెల్ల నొక్కపరివమ్మయ్యె—ఇట వమ్మయ్యె- నాశమయ్యెనని యర్థము. ఇది వైకృతవిశేష్యము.

ఉద్యోగపర్వమునందు.

«సొమ్ము నిష్ప్రయోజనముగ వమ్ముసేఁత»

విరాటపర్వమునందు.

«అకట యీఁబడి వమ్మయిపోయె దుర్జయంబైన బలంబు» విశేషణమైనప్పుడు గాని «వ్యర్థమైనది» యను నర్థములేదు. పిడుగునకు బియ్యమునకు నొకటేమంత్రము చదువవుఁడు.

ఏనాములో మే మవధానము సేయునపుడు బ్రహ్మశ్రీ చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రి గారు నాఁటిసభ నలంకరించియున్నారు. గురుదేవతాప్రార్థన మొనరించినపిదప మేమా యనపై నొకపద్యము చెప్పినారము. అందలియభిప్రాయము:— «పలుచోటుల నవధా

శా॥ *శ్రీనాథాదిమహాకవీశ్వరులు ప్రాచీనార్యవాగ్దేవతా
సూనుల్ మున్ను లిఖింపఁ బేర్వడయునా శ్లోకాలు శ్లోకాలవి
జ్ఞానంబొప్పఁగ స్వీయపుస్తకములన్ సంధించియున్నారల
య్యానిర్ణీతిని వీరుదొంగలని వ్రాయంజెల్లునే యేరికిన్.

ఉ॥ వ్రాసినకల్పనంబులకు పల్కును నెత్తినయెత్తుఁగూడ వి
న్యాసము చేయువారలల గారిరి వేనకువేలుసత్కవుల్
దోసమెయద్ది వారికిఁ గుతూహలమాదరముంటఁ జేసి యా
వ్రాసినకల్పనంబులకు పల్కును నెత్తినయెత్తు చేకొనన్

ఉ॥ ఇంతియె కాక యొక్కకవి యింతకు మున్ను రచించినట్టి వృ
త్తాంతము కల్పనల్ మఱియు నక్షరముల్ సయితమ్ముగాఁగ నా
ద్యంతము పూసగ్రుచ్చినటులన్యకవీశుఁ డదృష్టపూర్వత
ద్వృత్తుఁడునున్ రచించుననఁ దప్పెగుణాగ్రణత్వముండినన్.

---

నిమై పరఁగిన వేంకటశాస్త్రిగారి యవధానమం దొకసభ్యుఁడు పృచ్ఛకుఁడునై యుం డుటంజేసి మాకవిత్వము మఱింత పరికాశింపఁగలదు'' అని.

ఇట్లు తనసభ్యతను బొగడినందులకాయన మమ్మభినందించెను గాని యపుడు గురువుగాఁ జెప్పలేదని గ్రుద్దులాడలేదు. ఆపొగడికచే వారికి శిష్యులైనట్లు తేలినదఁట! వహవా! ఈబాదరాయణసంబంధకల్పన మచ్చముగా వేంకటశాస్త్రిగారిదే. ఏమన?

సీ॥ ఏనాతికొకగుబ్బ గానశాస్త్రియుమ్మ రెండవగుబ్బ సాహితీడంబరంబు
ఏనాతియిులు సత్కవీశాననంబు రెండవయిల్లు చతురాననాననంబు
ఏనాతి ప్రియశిష్యుఁ డానాగసంభవుం డటుమీఁదిశిష్యుండు వ్యాసమౌని
ఏనాతిపుత్రుల య్యేడ్వురుమునులు దేవమనుష్యులెల్లరుఁ బౌత్రభూతులు

---

*ఉద్దామద్యుమణిద్యుతివ్యతికరప్రక్రీడదర్కోపల జ్వాలాజాలజటాలజాంగలతటీ నిష్కాజికోయష్టయః ... ... ... ... ... ... మురారిః

శా॥ మాళిం......ప్రాలేయాహిత సంప్రదీప్తకిరణ ప్రక్రీడదర్కోపల జ్వాలా జాలజటాలజాంగలతటీ వాచాలకోయష్టినై. ... ... హారవిలాసము

మ॥ *"కవితావేశముచే జనించియు సువిజ్ఞానస్వరూపంబునా
కవి నుంజూపు పరిభ్రమించు నలయాకాశంబుపైనుండియా
భువికిన్ భూమినినుండియున్ దివికి"నాన్ మున్ జెప్ప నాంగ్లేయస
త్కవివాక్యంబులఁజూచుకొండదియె శంకల్ దీర్చి మేల్ కూర్చెడున్

చ॥ "హృదయగతింబురాతనకవీశ్వరు లేఁగని త్రోవ లేదఁ"టం
చుదితసరస్వతీపటుదయోదయుఁడూర్జితసదుష్కవిప్రథా
చ్ఛిదురుఁడు సంకుసాలనరసింహకవీంద్రుఁడు చెప్పఁబోఁడె జో
కదగఁగఁ బ్రౌఢమైన కవికర్ణరసాయనమందుఁబొందుగన్

శా॥ †కాశీఖండమునంగలట్టియొకచొక్కంబౌసమాసంబువి
శ్లేషానుండలకుట్టినామ కవిబంహిష్ఠుండు తంజాపురీ
దేశాధీశుని లక్ష్యపెట్టనిమహాధీరుండతండే రసా
వేశత్వంబునఁగాక చేర్చుకొనునే స్వీయప్రబంధంబునన్

---

ఇందు సరస్వతికి మొదటిశిష్యుఁడు వాల్మీకియనియు నటుమీఁదిశిష్యుఁడు వ్యాసమౌనియనియు మూఁడవపాదమునఁ జెప్పఁబడియున్నది. సరస్వతియొద్ద వీరిరువురు విద్యాభ్యాసముఁజేసిరని యేమహాకవియుఁ జెప్పియుండలేదు. అచ్చటచ్చటఁ గొందఱుకవులు సరస్వతి మాకుఁదల్లియనియును, మఱికొందఱు ఉపాస్యదైవతమనియును, మఱియుం గొందఱు భార్యయనియుఁ జెప్పుకొను వాడుకగలదు. దానింజూచి యీగ్రంథకర్త వాల్మీకియు వ్యాసుఁడును సరస్వతికి శిష్యులనికల్పించెను. వీరు శిష్యులుగారు, సరస్వతి నుపాసించువారు. మొదటికవి వాల్మీకియనియు, రెండవకవి వ్యాసుఁడనియు

---

*The poet's eye in a fine Frenzy rolling.
Doth glance from heaven to earth, from earth to heaven.

*Shakespeare's Midsummer Night's Dream.*
*Act V. Scene I.*

---

†కృతాన్త మహిషగ్రైవేయ ఘంటారవః    వ్యాసః
కృతాన్త మహిషగ్రైవేయ ఘంటారవః    భట్టః

గీ॥ *వ్యాసముని యేగనట్టి త్రోవలునుగలవె
†మాఘుకవికూర్పకున్నట్టి మాటకలదె
‡కాళిదాసుండునోడువకకలదె యుపమ
కానకవిమాత్రుఁడెల్ల దొంగయెతలంప.

చ॥ §ఇతరులమాట చెప్పఁగను నేటికిమాటికిసర్వసత్కవి
ప్రతతికినొజ్జయై, పలుకుపల్కినఁ బల్కినఁజూచుశారదా
సతిగలకాళిదాసుఁడెవిశారదమైన పురాణధోరణుల్
మతియుతులెల్ల మెచ్చఁగను మాటికి నెందనకావ్యపద్ధతిన్

మ॥ ఇటులనన్యోన్యసుభావముల్ గలియఁబోకింపారుపొత్తంబులె
ప్పటికేవుండవు చౌర్యమీయదని యెవ్వారేనినేకాలమం
దిటులంబల్కరు పల్కువారలరరే! యేతెంచియున్నారలి
ప్పటికిన్నీరలు, సంతసంబుగలిగెం బ్రాజ్ఞత్వముప్పెంగెడిన్.

ఉ॥ నాకుజమానివ్యాసముని నాయకునింబలుకుంబడంతిక
న్నాకుకొమారులన్న నిదిమూనుకొతప్పుబలారెకల్పనం

---

హృదయముననుండుటచే నీయన సరస్వతికి మొదటిశిష్యుఁడనియు రెండవశిష్యుఁడని యు భ్రమసి వ్రాసియుండును. ఇట్లువ్రాయుటకు మఱియొక కారణముఁగూడఁ గనుప ట్టుచున్నది. ‘‘సంగీతమపి సాహిత్యం సరస్వత్యాః కుచద్వయమ్’’ అను శ్లోకపాదార్థ మును దస్కరించి ‘‘ఏనాతికొకగుబ్బ గానశాస్త్రంబు రెండవగుబ్బ సాహితీడంబరంబు’’ అని మొదటిపాదమునువ్రాసి యట్లే రెండవపాదమునుగూడ వ్రాయఁగడంగి యొకయి ల్లు సత్కవీశాననమనియు రెండవయిల్లు చతురాననాననమనియుఁ గ్రమభంగముగాకుండ నే నుడివెను, కాని చతురాననశబ్దముపై నానశబ్దము వేయుట చింత్యము. ఇంతియకాక బ్రహ్మదేవుని నాల్గుమోములందు సరస్వతి నివసించియున్నదని కవులు ఘోషించుచుం డఁగా నాననంబని యేకవచనముఁ బ్రయోగించుట యప్రయుక్తము. జాత్యేకవచనము

---

* వ్యాసోచ్ఛిష్టం జగత్సర్వమ్. †నవసర్గేగతే మాఘేనవశబ్దోనవిద్యతే. ‡ఉప మాకాళిదాసస్య. §అశ్వఘోష బుద్ధచరితము. చూ. అప్పాశాస్త్రి విద్యావాజస్పతి మాళవికాగ్నిమిత్రపీఠిక. చూ. అగ్నిపురాణము, శివపురాణము. రామాయణములు. చూ

బేకనఁబట్టరాదనివహించితిరొక్కొ! ప్రతిజ్ఞ! నేఁటితో
మీకుబుణంబుతీఱెఁగవిమిత్రులు!మూయుఁడుమీవరాంగముల్

శా॥ ఔరా! యెంతటిదుర్వివాదములుస్వాహంభావసంసూచ్యహం
కారంబుల్ కవికోటికిచ్చెను వషట్కారంబులయ్యారె ధి
క్కారంబుల్ వరవాఙ్మయంబునకున్యక్కారంబులాహా! యలం
కారంబుల్ నయగారముల్ కడుఁ బ్రతీకారంబులుంగారముల్

ఉ॥ చాలవిచారణంబులును జర్చలుశోధనలుంబొనర్చి "ముం
గాల" పదంబుపొంతఁగల "కాఱును" ధాతుప్రదుష్టమంచు నాఁ
జాలదు, లేదుమీరెటులొసంధిలఁ జేసినసాహచర్యమీ
యేలలఁబాడనేమియగు నేవజనింపదె యావత్రావినర్

ఉ॥ *సీసమునందుఁ బాదముల శేషములొక్కవిధానఁజెప్పన
భ్యాసితశిక్ష లేదనుట వాదముకోసము నెప్పకొందమీ
దోసముపూర్వపుంగవుల దోసమువారలకిట్టిదోసముం
దోసముచేసెఁగన్గొనుఁడి తొల్లిటికైసరికబ్బపుంగముల్

నుటయుం బోలదు. బ్రహ్మకు నాల్గుమోములుగలవని యెఱుంగనివారలైన సమన్వయిం చుకొందురనుటకునుజతు రాననశబ్దము నాల్గుమోములుగలవాఁడని మేలుకొలుపుచున్నది. ఇట్లు క్రమభంగముగాకుండ వ్రాయుటకే వాల్మీకి మొదటిశిష్యుఁడనియు వ్యాసుఁడు రెండవశిష్యుఁడనియు నుడువుట. తుదకు విసుగుఁజెంది నాల్గవపాదము నెట్లయినఁబూ రిఁజేయుటనెంచి యందుఁ గ్రమభంగమునకొప్పుకొనిరి. ఈరీతి నీగ్రంధమునఁ బలుతా వుల మొదటిపాదముతో సరిదైనపాదములు నుడువలేమిఁ గ్రమభంగము చూజట్టుచు న్నది.

సీ॥ ముంగాల సింగారముంగా(ర) మేలుబంగారు రంగారు లంగాధరించి
దబ్బకాయలఁజూచి యబ్బగారనిబిల్చు గబ్బిగుబ్బలఁగంచు కమ్ముఁదొడిగి
మూఁడు నాలుగుపాదములు నిట్లేచెడినవి. మఱియు మొదటిపాదమునందు ముంగాల శబ్ద సాహచర్యమునఁ గాఱుధాతువు విపరీతార్థప్రదమై యేవపుట్టించుచున్నది.

*పాండురంగ మాహాత్మ్యము. చూ.

ఉ॥ అంబుజసూతిగేహిని దయందొరలుంగద నొక్కచోసయ
త్నంబుగఁగొంత, పైనియతనంబును జేసిన దానితోడసా
మ్యంబుగనుండఁబోవదనియందఱు సత్కవులొప్పికొంద్రుదై
వంబునుమానుషంబు నిటువాగునుఁబోల్పవె యింత భేదముల్

చ॥ యతనము లేక యొక్కొకటనగ్గలమై పరువెత్తుధార, పై
నతుకదయొంతకూర్చినను నట్టిటుమార్చినఁ గానిసుందరా
యితమయిపాఱునట్టియల యేఱులవంకలువానిఁడొంకల
ద్భుతమగురీతినందమునఁ బోల్చునె? కృత్రిమపుందరంగిణుల్

చ॥ రసముగఁజెప్పుచుందు కవిరాజులుశబ్దములందుడంబరం
బెసఁగఁగఁ జేయనీకొనరకృత్రిమ మైచనుదెంచుశబ్దపుం
బసయొయుటన్నిలంబమును బైనిబ్రయత్నము చేయకుంట చేఁ
బూసఁగునుగొందతేవపడఁబోలఁగఁ బోలునుగాక వారికిన్

చ॥ అహమిక జేసి యందఱనుహాస్యము చేసెడియట్టహాసమ
న్వహమునుదక్షకోటికిని నక్కట! యేవను జేసెఁబత్రికా
ప్రహసనమింత కెచ్చుకనఁబట్టెడు దుస్థితియందుడిందెడున్
బహుళతరానుభూతిమెయిఁ బట్టనియాసును వెళ్ళగక్కుచున్

---

హితీయుః—

సీ॥ ఏతాదృశస్థితి భూతివిఖ్యాతి విద్యాతి శయద్యోతి తాంతగుణను
సంస్కృతాంధ్రకవిత్వ సారస్యమారంద, ధారామధుకరాయి! తళుభకృతికిఁ
జెలువయామాత్య సంచితపుణ్యరాశికిఁ గామేశ్వరాంబికా గర్భమణికి.
ఇఁక మీరువ్రాసిన యంతర్నాటకమును ప్రతిహతముసేయ నీయట్టహాసమున
కనుబంధముగా నొకప్రహసనముపక్రమింపఁబడుచున్నది.

పత్రికాప్రహసనము.

చ. యతిచెడకుండఁ; బ్రాసముల నట్టిటుగూర్చెడు వేళ నర్థసం
గతి చెడకుండ; భావములఁ గల్పనఁ జెసెడునప్డు లోకస

ఉ॥ అక్కట! యేరొ వ్రాసిరని యట్టివిధానముగాఁగ, నందులోఁ
జెక్కుచెమర్పకుండఁగను జెన్నటివ్రాఁతలువ్రాసినారలీ
కక్కినకూఁటినిందినఁగఁ గట్టిన గుడ్డను గట్టు, నేటికిన్
"మక్కికిమక్కి"యన్నటులు మార్పఁగ నేటికి మాయ లేటికిన్.

సీ॥ అతిగణ్యమైన విద్యావంశముం బుర
స్కరణము చేసి సోదరులుమీరు
ఒకకొంచెమేనిను ప్పికొనిన నొప్పికో
కుండియున్నను సతీర్థ్యులరుమీరు
సాప్తపదీనంబు సఖ్యంబనంగ స
మీహితులైన స్నేహితులుమీరు
కవితపత్రికకుఁ బ్రాకట్యముంగొని తేరఁ
గలిగిన దర్బారుకవులుమీర

గీ॥ లగుట నింతగవ్రాయఁగా నవసరమ్మె
యెవ్వఁడో యిట్టుమాదున్న యీనినదన కాని
నదియుఁగూడ విచారింపకచ్చువేయు
నట్టివారలెయైనచో నవసరము.

ఉ॥ పత్రికయన్నఁబాడరె సపాత్రపువ్యాసములెన్ని యేనిఁ దా
మాత్రము నెల్లమోయుటనుమాటటులుండఁగ నెల్లవేళ స
ర్వత్రయనేకరూపములవారికిఁబొందియు వ్యాప్తిఁజేయు, దు
ర్గాత్రత నొప్పు హాస్యకరులై వడిదాష్ట్యము కావడించుచున్.

ఉ॥ "పత్రికలందగన్న డుపువారె జగమ్మనునట్టి సా
ధ్భాత్రము నొందువార"నికరంబును మీరుగ్రహించియున్నచో.

---

స్మృతిచెడకుండఁ; బండితులు మాఱనకుండ; సహావధానులై
కృతులొనరించి మించెడు కవీంద్రులకున్ యశముబ్బఁగా వుతన్.
(నాంద్యంతమున)

కృత్రిమమిట్లు చేయర యకించినతఁ బెడఁబాపికోలుకై
నెత్తును నన్నుముందినఁగ నేఁతురె దుష్పదకుంజవర్తులై.

ఉ॥ పాపముపత్రికాధిపులు వారొనరించునదేమియుండునే
దోపరబాధకై యెవరొయొక్కరుపంపినఁజూడఁబోరు ము
ద్రాపితమౌనదే శ్రుతివిధంబుగ మేటి ప్రమాణమౌనస
ద్రూపమహీపకాపశద సూపత దుర్భర శాసనంబునన్.

చ॥ శకటికకేని డబ్బుకనఁజాలక వేసగున్యాయవాదిడాం
బిక మొనరించురీతిఁ బరగీతి యొకించుక లేక యెవ్వరే
నొకరెదొపంపనచ్చుపడనూల్కొనఁ జేసెడి పత్రికాధిప
ప్రకరము "పోస్టు"వార్ న్యాయపద్ధతి సుద్ధతి సేయుఁగాన్పుతన్.

సీ॥ శవగంధసంకులంబప్ప విరజకుదుష్ట
పత్రికకును భేద బాధ లేదు
ముక్కుమూయించెడి మురుగుకాల్వకుదుష్ట
పత్రికకును భేద బాధ లేదు
అపవాదపుట్టించు నపశదునకు దుష్ట
పత్రికకును భేద బాధ లేదు
అటుడబ్బుగొనిమించు నపసాక్షికిందుష్ట
పత్రికకును భేద బాధ లేదు

గీ॥ ఎవరివారని వారలు నెత్తిపట్టి
లేనిపోనిప్రసంగమొం తేనిఁదాము

---

సూత్రధారుఁడు—(కలయఁజూచి సంతసముతో) ఆహా! నేటిసభకు విచ్చేసినవా రందఱు బడిపిల్లలే. ఇట్టివిద్యాంసులయెదుట నాయాట బాగుగసాఁగును. (తెరవంక కుఁ దిరిగి) విదూషకా! యిటురమ్ము. (ప్రవేశించి)

విదూ—ఆహాహాహాహా!

సూత్ర—(కోపముతో) ఏమిటి యీయట్టహాసము?

వ్రాయువ్రాయసకాండ్రఁ జేపట్టియాడు
పత్రికలఁజూచి యాదరంపడు నెవండు?

ఉ॥ గ్రామ్యము పాడుజేయునని గందరగోళమె కాని పత్రికల్
గ్రామ్యపుభాషసైతమును గ్రందుగ బాడు నొనర్చునిట్టి దు
ష్కామ్యపుఁబత్రికల్ తమమొగంబు తెఱంగు నెఱింగి యార! నీ
రమ్యముగాఁగ దూఱునఁట రాజితకీర్తుల సత్కవీశులన్.

శా॥ సామాన్యంబుగఁ బత్రికాధిపతులీషత్పాండితింబొందియాం
గ్లోమర్యాదనుగూడ నేర్చుటను నీగోలల్ తటస్థించు నీ
స్వామ్యుల్ పూర్ణపుఁబాండితింగనివిమర్శంబుల్ పొనర్పంగ నీ
వ్యామోహంబునశించుఁ గాదనర యాపైనెవ్వరేనిన్ బుధుల్.

ఉ॥ వీలునుజాలు లేని యవివేకులు వ్రాసినవ్రాఁతలెల్ల మీ
మూలమునంజగమ్ములను మోసముజేసెను వావదూకులున్
శీలవదగ్రణ్యులయి చెన్నలరారిరి పండితోత్తముల్
గేలియొనర్పఁగాఁబడిరి కీరితిఁజెందిరి పండితబ్రువుల్

సీ॥ మందుమాకులయసామాన్యగుణంబులఁ
ప్రకటింపఁగలలోకవంచకులుగ
రంగురంగులుగఁ బత్రములందు బొమ్మలఁ
గీలించు నలమైంద్రజాలికులుగ
వెడనవ్వుపుట్టించు విషయంబులసతంబు
పాటవంబుగఁ గూర్చు నాటకులుగఁ

---

విదూ—(నవ్వుచు) అట్టహాస మిదివఱకేయైనది. ఇది ప్రహసనము.

సూత్ర—అలాగా? అట్లయిన నీప్రహసన మెవరినిగుఱించి?

విదూ—“అప్పా! యిది భూలోకమా?” యన్నట్లడుగుచుంటివే. నీవొనరించిన నాంది
లోఁ దిరుపతి వేంకటకవులు గుంటూరులోఁ జేసిన ఘంటువధానము నెత్తి పొడువలేదా?

దమకున్న జ్ఞానలేశమె గొప్పయనిమదిఁ
బరికింపఁగల బ్రహ్మబంధువులుగ
గీ॥ చేయఁగాబోకుఁ డమ్మ మీచేతిమీఁద
మీయధిపతులవారికి మేలుఁగూర్ప
వ్రాయువ్రాయసకాండ్రురవారిఫక్కిఁ
గలితమతులారపత్రికాకాంతలార!
ఉ॥ "ఆలుపతివ్రతాతిలకమై యశమందిన, భర్తకామినీ
లోలుఁడునైయకీర్తికిపలోనగు, గేహినిఅంకుశంబులునై
శీలిమొనర్పఁగాఁబడియకీర్తికిలోఁగిన, భర్తయేకప
త్నీలలితుండునా"నవినీతియుదూరముమీకుఁబ్రతికల్!
సీ॥ బ్రహ్మసమాజవర్తనులయ్యు శాఖాభి
మానప్రవృత్తులమాన లేరు
శాఖాభిమానప్రసక్తప్రసంగంబు
మానివేయుదుమని మాన లేరు
"క్రిందనేపడినను గెల్చెమాకోడి" య
న్మాటల నింకైనమాన లేరు
పంశితదూషణావ్యాసమ్ములచ్చొత్తు
మంకుతనంబింకమాన లేరు
గీ॥ మీయధిపతులు వారితో పోయిగాఁగ
నెట్లుకాఁపురముంటిరో యెఱుఁగమమ్మ
మీయపాంసులతనుమేముమెచ్చనలదె
కలితమతులార పత్రికాకాంతలార!
సీ॥ తెలిసినచో యథార్థుల యథార్థములు స్ప
ష్టీకరించుచుఁ బ్రకటింపుఁడమ్మ

తెలియనిచో విమూఢుల దౌష్ట్యములనైనఁ
గొండొక ప్రకటింపకుండుఁడమ్మ
భూషించుచోఁ దాను బోరగిలంబడు
మాదిరి మీ కసమ్మతమెయమ్మ
తిట్టుచో మిగులనుద్రేకంబుపుట్టించు
మార్గమ్ము మీరలు మానుఁడమ్మ

గీ॥ లోకమున కెల్ల మీకు నాలోకమిచ్చు
జ్ఞానచక్షువు కలిగెనుగాన మరలఁ
జెప్పనదియేమి కలదు సుశీలలార!
కలితమతులార! పత్రికాకాంతలార!

సీ॥ "ఎడ్వరుటైజుమెంట్లు" ప్రకటించుట
పరమావధిగ నెంచు ప్రాజ్ఞులార!
"కాలముల్"నిండింపఁజాలుటే పత్రికా
ధిపులలక్షణమను ధీరులార!
"టూలెట్టు"టంచుఁ బత్రాలలోఁ దాటికా
యలయంతవేయు పెద్దన్నలార!
"ఎడిటోరియలునందుఁ" జెత్తవ్రాఁతలను వ్రాయ
సాహసించెదు మహాచతురులార!

గీ॥ పత్రికాకాంతలను వెలపడఁతుకలుగఁ
జేయనెంచకుఁడయ్య! నారాయణ విట
దూషితలు కాంత లెప్పుడు త్రోవలోని
కరుగుదెంచని విధము మీ రరయకుండ్రె?

సీ॥ వెలసెనేయొక్కఁ డాంధ్రులయందు బాలగం
గాధరునంత యగాధమూర్తి
పొడమెనేయాంధ్రుల పుడమియందు సురేంద్రు
నంతటికీరితి నలరువక్త
వెడలెనేత్రైలింగ విషయమందును లాల
మోహానునింబోలు స్ఫూర్తి
పొడసూపెనేయాంధ్ర భూఖండమందును
నరవిందునంతటి యలఘుమూర్తి

గీ॥ పుట్టెనేయప్పశాస్త్రిని బోలువాఁడు
వదిచూపింపుఁడాకని జే యెత్తిపీఁడ
టంచుమనయాంధ్రదేశమ్మునందు నెందు
నెందులకుఁ బ్రతికల్ పుట్టెయిన్ని వేలు?

గీ॥ ఉభయపక్షాభిమానంబు నెత్తిపట్టి
పూసికొనివచ్చి వెఱ్ఱిగ బూకరించి
కలఁతవెట్టెను ప్రతికాకులరవంబు
నోరుమూయించుతమలగుంటూరుసీమ



# PARVATIPARINAYAM.



A DRAMA IN FIVE ACTS.

BY

CHILAKAMARTY LAKSHMI NARASIMHAM

*Author of*

Gayopakhyanam, Soundaryatilaka and

Karpuramanjary etc. etc.





2000 Copies.

***Mattai Subba Row***

*Publisher and General Merchant*

*RAJAHMUNDRY.*

1919.



[*Price 0-6-0.*

# పార్వతీపరిణయనాటకము

ఇది

చిలకమర్తి లక్ష్మీనరసింహముచే

రచియింపఁబడినది.



2000 ప్రతులు.

రాజమహేంద్రవరము.

మట్టే సుబ్బారావుచే

శ్రీ విద్యానిలయముద్రాక్షరశాలయందు

ముద్రించి ప్రకటింపఁబడియె.

1919.

ఫ్రీరైట్. వెల 0—6—0

# ఉపోద్ఘాతము.

చిన్నతనమునుండియుఁ దెనుఁగుబాసలో నాకుఁ గొండొక యభిరుచి యుండుటచే నీవఱకు నారచించిన వచనకావ్యములకుఁ దోడుగ నెద్దియేని యొకమహాకవి ప్రణీత మగునాటకమును గీర్వాణభాషనుండి యాంధ్రీకరింపవలయునని నేను దలపోయుచుండ నాస్నేహితులలో నొకరు బాణకవిప్రణీత మగు పార్వతీపరిణయము రసవంతముగ నున్నదనియు దానిఁ బరిగింపు మనియు నాతోఁ జెప్పిరి. అంతట నే నాపుస్తకముఁ దెప్పించి చదివి మఱియొకవ్రాఁతప్రతి యొకమిత్రునియొద్ద నుండఁగాఁ దెచ్చి రెంటినిఁ బోల్చి చూచి పాఠములయందున్న స్వల్పభేదములను నాబుద్ధికి యుక్తమని తోఁచినట్లు సవరించి గ్రహించి యీచిన్ననాటకము నాంధ్రీకరించితిని. రసవంతముగ నున్న మూలగ్రంథమునందలి సారస్య మేమియుఁ జెడకుండఁ దెనుఁగునను మార్పవలయునని ప్రయత్నించితిని. నాప్రయత్నమును నే నెంతవఱకు నెరవేర్చితినో చెప్పుటకు నే నసమర్థుఁడను. ఆవిషయమును గుణగ్రహణచణబుద్ధులయిన చదువరులు నిర్ణయింతురని వారికి విడుచుచున్నాఁడను. నా కీగ్రంథము నాంధ్రీకరించుటలోఁ దోడుపడిన బ్రహ్మశ్రీ యాకుండి వ్యాసమూర్తిశాస్త్రులవారికిని బ్రహ్మశ్రీ కోపూరి దక్షిణామూర్తిశాస్త్రులవారికి ననేక నమస్కారములు కృతజ్ఞతాపూర్వకముగా నొసఁగి మహాకవియగు బాణునిఁ గూర్చి యించుక ప్రసంగించెదను.

## బాణకవి

ఇతఁడు సంస్కృతకవులలో మిగుల సుప్రసిద్ధుఁడు. ఇతఁడు కాశ్మీరదేశమున జనన మొందెను. తండ్రి చిత్రభానుఁడు; తల్లి రాజదేవి. ఇతని తల్లిదండ్రు లిరువురును బాల్యమునందే గతింపఁగా స్వయంకృషివలన నితఁ డసమానసాహిత్యమును నిరాఘాటకవిత్వమును సంపాదించెను. ఇతని పాండిత్య మసమానము. పండితప్రకరముచేత నత్యంతముఁ గొనియాడఁబడు హర్షచరిత్రము, కాదంబరి యను వచనకావ్యముల నీబాణుఁడే రచియించెను. పద్యకావ్యము లెవ్వియు నితఁడు రచియించినట్లు కనఁబడదు. కాని పార్వతీపరిణయనాటకము, చండికాశతకముగూడ నితనిచే రచియింపఁబడినవి. పార్వతీపరిణయమునందును రత్నావళియందునుఁ గల సామ్యవర్ణనలు చూచి కొందఱు రత్నావళీనాటకమునుఁగూడ బాణుఁడే చేసి కర్తృత్వము తనప్రభువగు హర్షవర్ధనునం దారోపించెనని వ్రాసియున్నారు. పార్వతీపరిణయమునుఁ జండికాశతకమునుఁ జేయుటచేత నితఁడు శివభక్తుఁడని తేటపడుచున్నది. ఇతఁడు తక్కిన సంస్కృతకవులవలెఁ బద్యకావ్యముల రచియింపకున్నను నధిక సాహితీపటిమవలనను, రసపుష్టిబాహుళ్యమువలనను శబ్దసౌష్ఠవమువలనను గథాచమత్కృతివలనను గల్పనాప్రాగల్భ్యమువలనను నీకవిశిఖామణి పద్యకావ్యముల రచియించిన మాఘ, భారవి, శ్రీహర్ష, కాళిదాసాదులతో సమానగౌరవమును గాంచియున్నాఁడు. సంస్కృతమునందు గద్యకావ్యములను

దారితీసి క్రొత్తపుంత త్రొక్కిన సాహసికుఁ డితఁడే. వీని మార్గము నవలంబించి సుబం
ధుఁడు వాసవదత్తను, దండి దశకుమారచరిత్రమును గద్యములుగ రచియించిరి. ఇతని
యందు గీర్వాణకవులకుఁ గలిగినగౌరవ మీతని నాటకములఁబట్టియు శతకములఁబట్టియుఁ
గాక కాదంబరీ హర్షచరిత్రలవలననే యయియున్నది. "కాదంబరీ రసజ్ఞానం ఆహారోపి
నరోచతే" * యను శ్లోకోక్తిఁబట్టి విద్వాంసులు కాదంబరియం దెన్నిగుణవిశేషములు
కనుపట్టి నాగ్రంథకర్తను గౌరవించిరో తేటపడును. కాదంబరీశబ్దమునకు మద్యమని
కూడ నర్థముండుటచే నారసమును ద్రావినవారు పరవశత్వము నొందుదురని పండితులు
శ్లేషించియున్నారు. "బాణోచ్ఛిష్టం జగత్సర్వం" అని యింకొక శ్లోకోక్తియున్నది.
ప్రపంచమంతయు ననఁగా భాషాప్రపంచ మంతయు బాణుని యెంగిలియే యని దాని
యర్థము. సంస్కృతమునందు బాణుఁడు ప్రయోగింపక విడిచినశబ్దము గాని, వర్ణింపక
విడిచిన యంశము గాని లేదని దాని భావము. ఆర్యాసప్తశతి చేసిన గోవర్ధనాచార్యుల
వారు బాణుఁడు "పుంభావసరస్వతి" యని వ్రాసియున్నారు. జయదేవుఁడు తనప్రస
న్నరాఘవనాటకమునఁ గవులఁ బ్రశంసించుచు "బాణుఁడు సరస్వతికి పుష్పబాణుఁ
డని" నుతియించినాఁడు. ఇంక ననేకులు ప్రాచీనకవులు బాణుని బహువిధముల
నుతించియున్నారు

మనవారు పూర్వకాలమునందు దేశచరిత్రములు వ్రాయకపోవుటచే నిట్టికవిసార్వ
భౌములు లేనాఁటివారలో, యెందు వసియించిరో, యెట్లు తమజీవితకాలము గడపిరో
తెలిసికొనుటకు మనకు శక్యము గాకయున్నది. అదృష్టవశమున నీబాణునికాలము నిర్ణయిం
పఁ గొన్ని యాధారములు దొరకినవి. ఈకవి కాలము నిర్ణయించుటకు వాని ప్రభువైన
హర్షవర్ధనునికాలము తెలిసికొనవలయును. ఈహర్షవర్ధనునికాలము తెలియుటకు వాని
సమకాలికుఁడైన యొక విదేశీయుని గ్రంథ మాధారము చేసికొనవలయును. హుయను
త్సాంగను చీనాబౌద్ధుఁ డొకఁడు బౌద్ధమతమునకుఁ బుట్టినిల్లగు భరతఖండమునుండి
తమమతగ్రంథములను గొనిపోవ వచ్చి యాసేతుశీతాచల మగు దేశమంతయుఁ బదునాలు
సంవత్సరములు తిరిగి తాఁజూచిన రాజులఁగూర్చియు, దేశములఁగూర్చియు సచరిత్ర
వ్రాసినాఁడు. అదియే మనకిపుడు ముఖ్యమయిన యాధారమయియున్నది. ఆచరిత్ర
మునుబట్టియు నితరాధారములఁబట్టియుఁ జరిత్రకారులు వ్రాసినట్లు నే నిందు వ్రాయు
దును. కన్యాకుబ్జదేశమును బ్రభాకరవర్ధనుఁడు పాలించుచుండెను. అతని మరణా
నంతరమున వాని పెద్దకొడుకు రాజ్యవర్ధనుఁడు రాజయ్యెను. కర్ణసువర్ణ దేశాధీశ్వరుఁ
డైన శశాంకభూపాలుఁడు రాజ్యవర్ధనునిపై దండెత్తి వానిఁ జంపఁగా మంత్రులు వాని
తమ్ముఁడగు హర్షవర్ధననునికి శీలాదిత్యుఁ డనుబిరుదుతో రాజ్యమొసఁగి పట్టాభిషేకముఁ
జేసిరి. కన్యాకుబ్జమును నేలినరాజులలో నితఁడు గడుఁ బ్రసిద్ధుఁడు. ఇతఁడు బౌద్ధ
మతమునం దత్యంతాదరము కలవాఁడయి సుగుణవంతుఁడయి యనేకవిహారములను,

---

* కాదంబరీ రసజ్ఞానము ప్రియముగాఁ దని కాహారమైనను రుచింపదని భావము.

వైద్యశాలలను, స్తూపములను గట్టించి ధన్యుఁడయ్యెను. చీనాదేశీయుఁ డగుహుయను నుత్సాంగు కామరూపదేశమునందు నాలందమఠమునందుండఁగా, హర్షవర్ధనుఁడు వానిని బిలువనంపి యాదరించి, రాకఁగూర్చియు, వానిదేశమునందలి చిత్రములనుఁ గూర్చియు ననేకప్రశ్నము లడిగి సంతుష్టుఁ డయ్యెను. చీనాదేశీయుఁడు మనదేశముఁ క్రీస్తుశకము 629 సంవత్సరము మొదలు 645 సంవత్సరమువఱకుఁ దిరిగెను. కాఁబట్టి హర్షవర్ధనుఁ డాకాలపువాఁ డగుటకు సంశయముండదు. ఇదిగాక కొన్ని యితరాధారములఁబట్టి హర్షవర్ధనుఁడు క్రీ॥శ॥ 610 మొదలు 650 సంవత్సరములవఱకు కన్యాకుబ్జము నేలినట్లు చరిత్రకారులు నిర్ణయించిరి. కాఁబట్టి హర్షవర్ధనుని యాస్థానపండితకవి యగు బాణుఁడు క్రీస్తుశకము సప్తమశతాబ్ద ప్రారంభమున నుండెకతప్పదు. బాణుఁడు తన యేలిక యగునా రాజుచరిత్రమును హర్షచరిత్రమును వచనప్రబంధరూపముగా రచియించి యున్నాఁడు.

పార్వతీపరిణయనాటకమునకుఁ గథాంశమును బాణుఁడు స్కాందపురాణము నుండి గ్రహియించెను. విక్రమాదిత్యుని సభలోనుండునట్టియు నించుమించుగ నూఱేండ్లు బాణునికన్నఁ బూర్వుఁడగునట్టియు కాళిదాసీకథనే స్కాందమునుండి గ్రహియించి కుమారసంభవము మహాకావ్యముఁ జేసెను. ఈ యిరువురు నొకమూల గ్రంథమునుండియే కథ గ్రహించుటచేతనో యొకరపుస్తకమును రెండవవారు చదువుటచేతనో మఱియే హేతువుచేతనో కుమారసంభవ పార్వతీపరిణయములలోఁ గొన్ని సామ్యవర్ణనలు కలవు. ప్రాయశః బాణుఁడు తనకుఁబూర్వుఁడయిన కాళిదాసుకవిత్వమునందలి గౌరవముచేత నాగ్రంథము చక్కఁగాఁ బఠియించుటచే నందలి కొన్నిమాటలు, వర్ణనలు నిందుఁ బడియుండవచ్చునని పండితులుకొంద ఱభిప్రాయపడియుండిరి. కొన్ని యట్లున్నను, స్వభావవర్ణనము, పదలాలిత్యము, రసపుష్టి, మృదుశైలి మొదలగువిషయములలో బాణుఁడును కాళిదాసునకుఁ దీసిపోవువాఁడు కాఁడని పెక్కుపండితులు వ్రాసియున్నారు. ఈనాటకమునందు నారదుఁడు మహావాయుపథమునుండి క్రిందికి దిగునప్పుడును, మూఁడవయంకమునందు వసంతము వర్ణించిన యప్పుడును, నాలుగవయంకమున శంకరుని బ్రహ్మచారివేషమును వర్ణించినప్పుడు చేయఁబడిన కల్పనలు చదువువారికామాట నిజమని తోఁచకమానదు. సంస్కృతమునం దింత రసవంతమైన యీనాటకమునుఁ దెనిఁగించుటలో నాయొనర్చినదోషములను గణింపక పండితులు గుణము లేవైననున్న గ్రహించి యీగ్రంథము నాదరింపఁ బ్రార్థించుచున్నాఁడను.

ఇట్లు విన్నవించు;

విధేయుఁడు;

గ్రంథకర్త.

## ఈనాటకము నందువచ్చు పాత్రములు.

### పురుషులు.

శంకరుఁడు—కథానాయకుఁడు.

హిమవంతుఁడు—పార్వతితండ్రి.

నారదుఁడు — దేవఋషి.

మహేంద్రుఁడు—దేవతలరాజు.

దేవనంది—ఇంద్రసేవకుఁడు.

బృహస్పతి—దేవగురువు.

దేవలుఁడు—దేవదూత.

కాముఁడు—మన్మథుఁడు.

వసంతుఁడు—మన్మథమిత్రుఁడు.

నంది—శంకరుని సేవకుఁడు.

శిలాధరుఁడు—హిమవంతుని సేవకుఁడు.

విష్ణు—

బ్రహ్మ—

సూత్రధారుఁడు—

### స్త్రీలు.

పార్వతి—హిమవంతునికూఁతురు (కథానాయిక).

మేన—పార్వతితల్లి.

వాసంతిక—వనదేవత.

రంభ—దేవవేశ్య.

రతి—కామునిభార్య.

జయ— } పార్వతి చెలికత్తెలు
విజయ— }

కౌశికి—హిమవంతుని యింటనున్న యొకయోగిని.

నటి—

ఇంకను నిందు విద్యాధరులు, కులపర్వతములు, భూతము, వృద్ధాంగనలు సందర్భానుసారముగా వత్తురు.

శ్రీ

# పార్వతీపరిణయనాటకము

---

## నాంది.

« మొదల స్త్రీమను నెఱిఁగి హరుమొగంబుం జూచి నాసక్తయై
పొదువ న్సిగ్గు కలంగి ధూమపు నెపమ్మొం బూని మోడ్పొంది భ
ర్తృదృగైక్యంబయి త్రిప్పఁట న్వరభవోద్వాప్తి న్గను న్వ్యాకులా
స్పదమై పొల్చెడు పార్వతీపరిణయారంచద్దృష్టి మమ్మేలుతన్. ౧

మఱియును :—

తే. గీ. అన్యు లగువా లకు నసమాన్య మగుచుఁ
బ్రబలుదర్పంపు రావగు పచ్చవిల్తు
నఘటితఘటనాతిసమర్థ మైనపత్రిభుత
స్థిరమనస్కులౌం డెడు మేలుఁ దెచ్చుఁ గాత. ౨

సూత్రధారుఁడు—(నాంద్యంతమందు సప్రణామముగ నంజలిఁ బట్టి)

క. అమితబ్రహ్మాండకుటుం
బములకు ల గ్గొదవఁ జేయు పరిపూర్ణావం
దమయులు పురాణదంపతు
లుమామహేశ్వరులు భూతి యొసఁగుత మాకున్.

(అని పుష్పాంజలిఁ జల్లి తెరవంకఁ జూచి) ఓసీ! యిటు రా.

నటి—(ప్రవేశించి) అయ్యా! ఇగో నేను వచ్చినాను.

సూత్ర—ఓసీ! యీసభ యిప్పుడు పార్వతీపరిణయ మను నొకానొక యద్భు
తరూపకమును జూడఁగోరుచున్నది సుమా!

నటి—అయ్యా! యది యేకవి రచియించిన కృతియై యుండవచ్చును?

సూత్ర—తే. గీ. అంబుజహాగర్భముఖరంగమందు లాస్య
మనిశ మొనరించు వాణి యేఘనుని నాల్క

నాట్యమును జల్పు నతఁడు బాణకవిరాజు
కలఁడు వత్సాన్వయాంభోధికౌస్తుభంబు. ४

ఆయనచేత సంస్కృతమున రచియింపఁబడి చిలకమర్తి లక్ష్మీనరసింహకవిచేఁ జనిగింపఁబడి విచిత్రసంవిధానమగు నీకథచేత సభ్యుల నానందింపఁ జేయుదము.

నటి.—అయ్యా! యితరనాటకము లనేకము లుండఁగా దేవరకు దానియందే యభిలాష మేల కలుగవలెను?

సూత్ర—క. సందర్భశుద్ధియుం గథ
పొందిక రసపుష్టియుండుఁ బూర్ణతఁగనియా
నందము నిచ్చుటిసభ్యుల
కందఱకును గొలుపఁజాలు నంబుజనేత్రా. ౬

అందలి గుణగ్రాహిత్వముచేతనే దానియం దభిలాషఁ గలవాఁడనైతిని.

నటి.—అట్లయిన యుక్తమే.

సూత్ర—(నటినిఁ జూచి) ఓసీ! పార్వతీపరిణయ ప్రసంగమునందుఁగూడ నీవు మనసులో విచారించుచున్న దానివలెఁ గనఁబడుచున్నావేమి?

నటి.—అయ్యా, యీ పరిణయప్రసంగముచేత మనపిల్ల బాలచంద్రిక కనురూప వరలాభమహోత్సవ మెట్లు కలుగునని నిరంతరము నాహృదయము చింతాకుల మగుచున్నది.

సూత్ర.—విచారింపకుము.

తే. గీ. కన్యలనభీష్టవరులతోఁ గలుపవిధియె
జతనమొనరించుచుండుఁ దక్షమయ్య మెఱఁగి
మంచుమలరాఁతు పెండ్లిచేయించుకొఱకుఁ
బూని పనిచేయు నారదమౌనివోలె. ౭

(నిష్క్రమించుచున్నారు.)

ఇది ప్రస్తావన.

---

# పార్వతీపరిణయనాటకము

## ప్రథమాంకము.

(అంతట నాకాశమార్గమున నారదుఁడు ప్రవేశించుచున్నాఁడు.)

నార — ఆహా! ఈ యమరకార్యఘటనమునందలి కుతూహలము జన్మ మెత్తినది మొదలు మున్ను నిశ్చయముగా విడువకున్న యది—

మనసు— చం. పొడమినదయ్యె దక్షునకు మున్నిజభర్తృవిరోధి నాతని
న్విడిచి గిరీంద్రుకింటఁ బ్రభవించిన దాసతి గౌరినాఁగ ని
ప్పుడతికి మంచుకొండను దపం బొనరించు మహేశుఁ గూర్ప ని
క్కడ నిపుడే బ్రయత్ని లైదఁ గాఁగల నిర్జరకార్య మెంచుమన్. ౭

కొంచె మెడము దిగి చూచి) నే నిపుడు పరివహమను పేరుఁగల వాయుపథము నందున్నాఁడను. అది యుక్తమే.

మ. తనియం జేరలఁ జుట్టునై వికచమందారప్రసూనౌఘసం
జనితంబై పవనోపనీత మగు నీ సౌరభ్యపుం గ్రోవిల జి
మ్మని తేఁటు ల్బరు వీనితీవలను సత్యాకర్షింబుఁ గావించు ది
వ్యనదీవాఃకణరాజి నామనసు ప్రాణానందముం బొందెడున్. ౮

(తొందరతో దిగుటనభినయించి క్రిందు చూచి) ఔరా! నే నిప్పుడు భూలోకమునకు దగ్గఱగా వచ్చితిని. ఎట్లనిన:...

చం. పొడచుచు సన్నశృంగములఁ బోలిచి చూడ నగంబులయ్యెఁ గోఁ
చెను నవి, తోఁచెఁ దేట జిగిచే నివి పాఱెడు నేఱులంచుఁ, గ్రోఁ
చెను నివి కార్ముకశ్రీసిరిఁ జేరని చెట్లని మంటిలాప్తి ని
వ్వేళుపున ధాత్రి చూడఁ దగు వైఖరి దాల్చెఁ గ్రమక్రమంబునన్. ౯

(ఆశ్చర్యముతో మరలఁ జూచి).

తే.గీ. క్రమతఁ బొడసూపినట్టి శైలములతోడ
నదులతోడను బట్టంపుఁ బొలములతోడ

వసుమతీచక్ర మెల్ల నాకసము మీఁది
కెగురునటులతోఁ జెంగిలిందిక దిగుమనుండె. ౧౦

ఒక్కముహూర్తమున హిమవత్పర్వతసమీపభూమికి దిగినవాఁడను.
(కొంచెము మీఁదను దిగఁజూచి) ఈశైలరాజేగదా !

ఉ. ఉన్నతతావిహీన భువనోపమశృంగములన్నభోంతరం
బెన్నక యొత్తిగించుకొని యేగెడునో యన భాసమానుఁడై
యన్నెలవెల్గు లట్లు తెలుపై సుపికాలత మించు సానుల
న్గ్రిన్నన వన్నెదిక్కులను గ్రమ్ముచు నుండెడు శేవరాజిలున్. ౧౧

అసాధారణమైన భువనధురంధర మహిమహిమచేత మందరగంధమాదన ప్రభృతులగు మహీధరములకన్న నిది యతిశయముగ నున్నదికదా! ఎందుచేతననఁగా :

తే. గీ. భువనగురుఁడైనపద్మసంభవుఁడు సుగుణ
సంపదకు మెచ్చియిచ్చు రాజ్యపదమూని
ప్రాభవము మీఱ సర్వపర్వతకులంబు
నేలు నమరస్వరూపుఁ డీశైలరాజు ౧౨

అందుచేతఁ గిన్నరాంగనలపాటలం జొక్కి కదలక జాలరి కృష్ణసారములతోడను తెల్లని తోఁకల ల్లాటచేఁ గపటచందోవిలాసమును గల్పించు చమరీమృగ సమూహముల తోడను గమ్మకస్తురి తావులచే నాకాశగమనమువలననైన యాయాసము నపనయించుచు బాలిపూవు వాసనలం గను రమణీయ మగు నీచరియదారిని ప్రస్తుత కార్యసాధనము కొఱకు నే నిపు డీ యోషధిప్రస్థ నగరమును బ్రవేశించెదను. (అని యట్లు చేసి ముందుకుఁ జూచి) ఇదియే యా యోషధిప్రస్థనగరము.

చ. పొడవగు హేమశృంగములపొంత వసించు మొగుళ్ళుఁ గల్గి యె
య్యెడ సురభూజవాటులను నింపగు ప్రాంతతలంబుఁ గల్గి మిం
చెడు సురరాజచాపము సృజించు మణీగృహకాంతిఁ గల్గి కొ
ల్పెడుఁ గడ నింపు వేడుకను విస్మయమందిర మీపురంబెదన్. ౧౩

(పురప్రవేశ మభినయించి ముందుఁ జూచి) ఆకసము నొరయు గోపురశిఖరములచేత నక్షత్రపథము నంటుచున్న యిదియే హిమవంతుని మేడ. (ప్రవేశము నభినయించి యాకాశము నకుఁ జూచి) ఓయీ కంచుకీ! కులాచలచక్రవర్తి యొక్కఁడె నున్నవాఁడు? ఏమనుచున్నావు? దేవియైన మేనకతోఁగూడి నేఁడిప్పు డాలోచింపును లోపలి మంటపమున నున్నారనియా. అట్లయినఁ గార్యము విన్నవించుటకిది తగిన సమయమే

(అని నడచుచున్నాఁడు.)

(అంతట హిమవంతుఁడు, మేనక, కొలఁది పరిజనములు ప్రవేశించుచున్నారు.)

హిమ—దేవీ! కన్యాపితృత్వము గృహస్థుల కధికతరదుఃఖమును దెచ్చునుగదా మన కులభూషణ మగునీగౌరి పెండ్లియీడునకు వచ్చినది. అది యుక్తమే.

తే.గీ. సుదతి చనుమొగ్గలాగట్టిఁ జూచు నిప్పు
డెదను నొకయింత వికసించ వెదఁదఱొమ్మ
గలదు లేదనఁ దగు లేత కౌను నడుమ
నమరి యున్నది సన్నని యారుబారు. ౧౪

మేన—ఆర్యపుత్రా! తమరు సెలవిచ్చినటు గౌరి వివాహమంగళయోగ్యురా లయినది.

హిమ—దేవీ! యింకొకమాట వినుము.

ఆ.వె. కోమలాంగివలుదగుబ్బ లెట్టెటువృద్ధిఁ
జెందు నట్టులటులె చిక్కుచున్న
దకట నాశరీర మఖిశంబు నీమెకు
మగనిఁ గూర్ప మనసు మఱుఁగుచుంట. ౧౫

మేన—అహోరాత్రములం దీకార్యమునే చింతించుచు దానియందే మనసు నిలుపుచున్న నాశరీరముమాత్ర మట్లు తోఁచుచుండ లేదా!

హిమ—(ముందుసఁ జూచి) దేవీ! వీణావిహారి యగునారదముని యిట వచ్చుచున్నాఁడు. అతని కర్ఘ్యమును దీసికొనిరమ్ము.

మేన—ఆర్యపుత్రు లానతిచ్చినట్లు చేసెదను.

హిమ—(లేచి దోసిలియొగ్గి) మహాత్మా! నమస్కరించుచున్నాఁడను,

నార—అభ్యుదయపరంపరావాప్తిరస్తు.

హిమ—(పీఠమునవైచి యర్ఘ్యము సమర్పించుచున్నాఁడు.)

నార—(గ్రహించుచున్నాఁడు.)

హిమ—(సంతోషముతో చేతులుమోడ్చి)—

ఆ. వె. కోర్కులు నెరవేర్చికొని, సాధనటు సేసి। పరమతత్త్వమంత భావనమున
తమ్ముఁ బోలువారి దర్శనం బలు లల్ప। పుణ్యులకు లభించ మునివరేణ్య. ౧౬

నార—సర్వాశ్రమోపకారులగు మీవంటి గృహస్థులను నిస్పృహులైనను మావంటివారు చూడవలసినదే.

హిమ—తమరు సెలవిచ్చినది యనుగ్రాహ్యావిషయము.

నార—అనుగ్రాహ్య నను గ్రాహ్యతయందు సందేహమేమున్నది? మఱియును బ్రహ్మభూమివగు నీవు మాను ద్యానీయుండవే. ఎందుచేత ననఁగా—

ఆ. వె. సర్వలోకమాన్య జాహ్నవి మునుశంభు
శిరము డిగ్గి నీదు శిఖర ములఁ
జేర నక్షణమాటచేతనే గద నేఁడు
భువనపావనియయి పొగడొసగను ! ౧౭

హిమ—తమయాజ్ఞానువర్తియగు సేవకుని మీరీలాగున నతిస్తోత్రము సేయనేల ?

నార—ఆ. వె. నిరుపమానరూపనిలయ లీవ్యాయసుతల్
కలదు నీకు గంగగౌరియనన

హిమ— ఇది నిజమే.

నార— అందుఁ బ్రియమున్నెయనురూపగుణముఁగాఁ
బడసె సుగుణరాశి వారిరాశి.

హిమ— ఇది కలదు.

నార—నీ రెండవకుమారికి నెవని నుద్దేశించినావు ?

హిమ—మహాత్మా ! ఈసంగతినే విచారింపుచు నామనసు మిక్కిలి యనుతాప
ము నొందుచున్నది.

నార—ఆ. వె. నాగలోకమందు నాకలోకమునందు
మర్త్యలోకమందు మూఁడుపూటి
కర్హుఁడగు వరుఁడు దొరకఁడాజగత్త్రయభర్త
భర్త గాఁడఁజెచెల్లదు హితకు.

హిమ—అదియును మీరే సెలవీయ సమర్థులు.

నార—(తనలో) ఇతనికిఁ జంద్రమౌళిమాటఁ జెప్పక సామాన్యవచనములచేత
దెల్పఁబుచ్చెదను. (ప్రకాశముగా) ఈయర్థమును దివ్యదృష్టితో మేము చూచినారము.
ఎట్లనిన:—నీకూతుఁరు విశ్వాధికుఁడైన యొకవరునిఁ బడయఁగలదు. ఇట్టివాని నని విశే
షించి కనుఁగొనము.

హిమ—విశ్వాధిపుఁ డనుమాటయూఁడుచేతనే ధన్యుఁడనైతిని.

నార—ఆ. వె. నీతనూజ తొంటినీదునోముఁ పండి
యనని నచరించునాదిశక్తి
నిరుపమానరూపనిధియైన యీబాల
నితరకన్య లట్లు లెంచవలదు. ౧౮

అందుచేత నీకూఁతురు యౌవనికి యొకనికి నీయఁదగినదికాదు.

హిమ—నేను తమయానతి దాఁటను.

నార — మీయభ్యుదయమునిమిత్త మింకొకహితముఁ గూడ నింపుక నే నుప
దేశించుచున్నాఁడను. ఏదనిన —

ఉ. ఎవ్వఁడు తొల్త నీభువనమెల్లను రూపము లెన్మిదింటిచే
నెవ్వనిలోచనత్రితయ మేర్పడె వెల్గులు మూఁటిచేతనే
యెవ్వఁడు దేవతల్గలుగ నెంచఁడొ యీశ్వరశబ్దవాచ్యుఁడౌ
నవ్విధుమౌళి నీచరయులందుఁ దపంబొనరింప నిత్తుజెన్. ౧౯

హిమ — అది నిజమే.

నార — అందుచేత స్వయముగ నీయొద్దకువచ్చిన యీయిందుశేఖరు నేదోయొక
పూజచేత సేవింపుము.

హిమ — మహాత్మా! ఆపూజ యేమో తమరే సెలవిండు.

నార — అనురూపసఖీజనపరివృత యగు నీకూఁతు గౌరినిఁ ఫలపుష్ప సమిధలు,
దర్భలు, దూర్వాంకురములుఁ, బూవులు సమర్పించుచుఁ జంద్రశేఖరుని సేవింపు " మని
నీవు పనుపుము.

హిమ — ఆలాగున నే చేయుదును.

నార — (తనలో) విత్తనము నాటఁబడినది. చేయఁదగినపనియు, సామాన్యవృత్తి
చేత నెఱిఁగించితిని. అందువలన వచ్చినట్లే యరిగెదను. (ప్రకాశముగా) హిమవం
తుఁడా! మేము చెప్పినట్లు తప్పక చేయుము. (అని యాకాశమార్గమున నిష్క్రమించు
చున్నాఁడు.)

హిమ — (చూచి)

తే. గీ. పట్టపగటియందును దన ప్రభలచేతఁ
బండువెన్నెల దిక్కులఁ బర్వఁజేసి
యరుగుచున్నాఁడు దివమున కనఘమూర్తి
మానివిభుఁడు రెండవచందమామవోలె. ౨౦

దేవీ! మునివచనమును విన్నావుగదా?

మేన — విశ్వాధికపురుషుఁడు నాథుఁడగు ననుమాట విన్నాఁడను.

హిమ — (తనలో) విశ్వాధికుఁ డనుమాట జాఱవిడుచుటచేతను జేయఁదగిన
పని నుపదేశించుటఁబట్టియు మాయమ్మాయికిఁ జంద్రశేఖరుఁడే వరుఁడనుట సూచింపఁ
బడుచున్నది. (ప్రకాశముగా) నారదోపదిష్టమైన యిందుశేఖరపరిచర్యను చేయుటకు
మనయమ్మాయిని నియోగింపఁ బ్రయత్నించెదను.

(అని యందఱును నిష్క్రమించుచున్నారు.)

ఇది ప్రథమాంకము.

## ద్వితీయాంకము.

[అంతట వాసంతికయను వనదేవత ప్రవేశించుచున్నది.]

వాసం—"వాసంతికా! తపోనియమమునందున్న చంద్రశేఖరునకు నందనవనము నుండి పూజాపుష్పములఁ దీసికొనిరమ్ము" అని నందీశ్వరునిచేత నే నాజ్ఞాపింపఁబడితిని అందుచేత నందీశ్వరుఁ డాజ్ఞాపించినట్టు లాకాశమార్గమునఁ జని నిజసౌరభముల దిగంతముల వెదజల్లు కల్పద్రుమకుసుమములు కోయుటకు నందనవనమున కరిగెదను.

(అని యాలాగునఁ జేయుచున్నది.)

(అంతట రంభ ప్రవేశించుచున్నది.)

రంభ—తారకాసురబందిగ్రహణసాధ్వసశంకితలు నచ్చరలు మహామేరుగుహలలో దాఁగియున్నారు. నేనో కుబేరనందనుఁడగు నలకూబరుని విడిచి క్షణమైనఁ బ్రాణములు నిలుపఁజాలను గనుక వానియొద్దకుఁ జనియెదను. (అని దిగుచున్నది)

వాసం—(రంభను జూచి) ఓహో! ప్రియసఖి రంభ వచ్చుచున్నది! ఆమెదగ్గఱకుఁ బోయెదను. (అని యట్లు చేయుచున్నది.)

రంభ—అహో! హిమవత్కటకవాసినియగు వాసంతిక యిదిగో! ప్రియసఖికి మంగళము.

వాసం—ప్రియసఖీ! యిక్కడి కేల వచ్చితివి?

రంభ—తారకాసురుఁడు చెఱపట్టునను భయమున శంకించుచు నచ్చరలు మేరుపర్వతగుహలలో దాఁగియున్నారు.

వాసం—నిజమే, వాఁడంతటి దుష్టశీలుఁడే.

రంభ—కుబేరనందనునిఁ జూడక నిముసమును జీవమును నేను నిలుపఁజాలనని నీవె చక్కఁగా నెఱుఁగుదువు.

వాసం—అది నును పే యెఱుఁగుదును. మీ యిరువుర యన్యోన్యానురాగమును బ్రసిద్ధమేకదా.

రంభ—తీయకిల్లుని వింటినుండి యేసె తెగక బయలువెడలు నమ్ములు పీడించు హృదయముఁ గలిగి, నెచ్చెలులకోఁ జెప్పకఁ నలకూబరునిఁ జేరఁ బోవుచు మార్గవశమున నిట వచ్చితిని.

వాసం—అట్టి యనురాగమున కిట్టి వ్యాపారము తగును.

రంభ—నీ వెక్కడి కరుగుచున్నావు?

వాసం — నిత్యానందనిజస్వరూపుఁడు, లోచనమాత్రబాధుఁడు నగు భగవంతుఁడగు నీలలోహితునకుఁ బూజాపుష్పములను నందనవనమునుండి తెమ్మని నందీశ్వరుఁడు నాకానతిచ్చెను.

రంభ — ప్రియసఖీ! అక్కడి క్రొత్తవృత్తాంత మేదైన నున్నదా?

వాసం — మఱి యేదియును లేదు. కాని తండ్రిపనుపున నెచ్చెలులతోఁ గూడఁ బార్వతి దినదినము వచ్చి మహాదేవు నారాధించుచున్నది.

రంభ — ఆరాధనకు ఫలమేమి?

వాసం — పరమేశ్వరప్రసాదమే.

రంభ — బాగున్నది. అయిన నీవు ప్రస్తుతకార్యమును జేయఁబొమ్ము. నేనును సంకల్పించుకొన్న కార్యమును జేయఁ బోయెదను. (అని నిష్క్రమించుచున్నారు)

ఇది విష్కంభకము.

---

[అంతట విజనసభామంటపమునఁ గూర్చుండి మహేంద్రుఁడు ప్రవేశించుచున్నాఁడు.]

మహేం — (మంటపద్వారముఁజూచి) ఓరీ! యెవఁడురా యక్కడ?

దేవనంది — (ప్రవేశించి) దేవా! యిదిగో వచ్చినాఁడను.

మహేం — నేఁడు మహాకార్యము నాలోచింపవలసియున్నది గనుక బృహస్పతులవారినిఁ దక్కఁ దదితరులను లోపలఁ బ్రవేశపెట్టకుము.

దేవ — చిత్తము. (అని నిష్క్రమించుచున్నాఁడు).

(అంతట బృహస్పతి ప్రవేశించుచున్నాఁడు.)

బృహ — (ముందుఁజూచి) ఏమి! ఈమహేంద్రుఁడు వివిక్తాస్థానమంటపమున నున్నాఁడు! ఓహో!

శా. కాంచుం గన్నులఁ గొన్నిటం దళితరక్తశ్రేణియౌవ్రజముం
గాంచుం గొన్నిట లేఁతనవ్వొలయుస్వర్గస్త్రీముఖాంభోజము
న్గాంచుం గొన్నిట నమ్రసేవకనమస్కారం బిట్లుండి క
న్పించు న్నాఁడు సహస్రనేత్రుఁ డెదుటం జింతించునట్లు ల్మదిన్. ౧

కాఁబట్టి యీతని సమీపించెదను. (అని యాలాగునఁ జేయుచున్నాఁడు.)

మహేం — (బృహస్పతినిఁజూచి) ఇందు దయచేయుఁడు.

బృహ — మంచిది. (అని భద్రాసనాంతికమునఁ గూర్చున్నాఁడు.)

దేవ — (ప్రవేశించి) దేవా! దేవదూతయగు దేవలుఁడు తనదొక మనవి యున్నదని విన్నపముఁ జేసికొనుచున్నాఁడు.

మహేం — అట్టులయిన వాని నొక్కని రానిమ్ము.

(అంతట దేవమాత ప్రవేశించుచున్నాఁడు.)

దేవ — ఈప్రభువు బృహస్పతితో నేదియో యాలోచించుచున్నాఁడు. అయిన నాతనిసన్నిధికిఁ బోయెదను. (అని సమీపించి) దేవరకు జయమగుఁగాక.

మహేం — దేవలా! విచారించుచున్నవానివలెఁ గనఁబడుచున్నావేమి?

దేవ — తారకాసురుని యాక్రమణము గాక మాకు వేఱు విచారకారణ మేమున్నది.

మహేం — ఇపుడు క్రొత్తయపరాధ మేమున్నది?

దేవ — హద్దుమీఱిన యసురపీడను దేవగణారిలో నెట్లు మనవి చేయుదును?

మహేం — దేవలా! భయపడక వాం(ఛ)ద్రయుద్యమును జెప్పుము.

దేవ — చెప్పుచున్నాడను. వినుండు.

చ. అమరనదిం జనించు కనకాంబుజము ల్పెకలించి మా కభీ
ష్టములకు నందనక్షితిజసంతతుల న్మొదలంటఁ ద్రుంచెఁ గా
మ్యముల నొసంగు పేర్పుఁగల మా సురధేనువు దొంగిలించి హా!

(అని సగముచెప్పి యూరకున్నాఁడు.)

మహేం — అవశిష్టముఁగూడఁ జెప్పుము.

దేవ — అమరసతీకచగ్రహణ మావయిఁ జేయఁ దలంతు రాఖలుల్. 2

మహేం — కులిశసహాయ మగు మద్బాహువు జాగరూకతతో నుండ నీకింత సందేహ మేదులకు? చూడు —

ఆ. వె. నముచి బలుని వృత్రు నామావశిష్టులఁ
గా నొనర్చి గిరులగఱుల నఱికి
జగము లెల్లఁ బ్రోవఁజాలు నా కిపు డడ్డు
వచ్చెఁ దారకునకుఁ బ్రహ్మవరము. 3

అయినను గొన్నిదినములలో దానికిఁ బ్రతిక్రియ కాఁగలదు. సముచితకార్యములఁ జేయుటకు నీవు పొమ్ము.

దేవ — చిత్తము. (అని నిష్క్రమించుచున్నాఁడు.)

మహేం — ఆచార్యా! ఇటుపిమ్మటఁ గర్తవ్య మేమి?

బృహ — ఇంతకుఁ బూర్వదినమందే తారకాసురుని యాక్రమణమును సహింపక దేవతాసభతోఁగూడ మేము భగవంతుఁడగు పద్మసంభవునియొద్ద కరిగి యడుగఁ దారకాసురుఁడు కుమారస్వామిచేత, గాక తదితరులచేతఁ జావఁడు. అతనిజన్మము కొఱకుపాయ మిది—

తే. గీ. మంచుమలసానువునఁ జంద్రమౌళి నేఁడు
చేయుచున్నాఁడు తపము నిశ్చింతతోడ
నేయుపాయంబుచేనైన నీప్రభునకుఁ
గలుగుఁగాత మక్కువ యద్రికన్యమీఁద. ౪.

అనంతరము తదుభయులకు జనియించు కుమారుఁడగు సేనానిచేత మీ మనోరథసిద్ధి కాఁగలదు” అని యవ్విరించి యానతిచ్చెను.

మహేం—గిరీశుఁడు గిరిజ నేలాగునఁ బరిగ్రహించును. పిమ్మట వారికుదయించు కుమారుఁ డెన్నఁడు మన మనోరథమును సిద్ధింపఁజేయును.

బృహ—మహాత్ములపలుకులు నిరర్థకములు కావు.

మహేం—(జ్ఞప్తికిఁ దెచ్చికొని సంతోషముతో) విరించి యాజ్ఞాపించిన మన కార్యము నంగీకరించినదియుఁబోలె తండ్రిపనుపున నెచ్చెలులం గలసి పార్వతి ప్రతిదినమును వచ్చి భగవంతు నిందుశేఖరుని సేవించుచున్నదని రంభముఖమునుండి వింటిని.

బృహ—అట్లయిన మనకోరిక సిద్ధించినదే.

మహేం—ఇంతమాత్రముచేతనేనా?

సీ. అతిమంజులమ్ములై యానందకరము లౌనప్సరోంగనల వాక్యములచేత
వీథులకొనలందు విశ్రమించుచు నున్నచారు కటాక్షవీక్షణలచేతఁ
జెలువారు వలరాజు చెఱకుసింగిణులట్లు మొదలంట వంగినబొమలచేత
జాఱినపయ్యెద సవరించుచో బాహుకమనీయకంకణక్వణముచేత
మాటిమాటికి నప్సరోమండలంబు
సలుపు తాదృశవిభ్రమసమితిచేతఁ
గలఁకనొకయింత మనమునఁ గాంచనట్టి
మానిరత్నంబు సుమి చంద్రమౌళియనఁగ. ౫,

అచింతనీయుఁడును, నధికానందసుందరుఁడును, ననాదినిధనుండును, ననంజనుఁడును, నగుణాక్రియుఁడునగు తన్నుఁదాఁ నిజాంతర్నేత్రమున సాక్షాత్కరించుకొని సముపసంహృతాఖిలద్వైతకల్పనావికల్పుఁడును, స్వతంత్రకర్తయు, చరాచరగురుఁడు నగు నా చంద్రమౌళి వశీకరణమునందు గౌరీపరిచరణ మేపాటిది?

బృహ—మహాత్మా! తక్కిన యువతులవలెనే యీమెను దలఁపకుము. ఎందుచేతననఁగా:—

తే. గీ. హాయలు దళుకొత్తు నెమ్మనియొఱపుఁ గల్గి
మనను హరియించు నొకవింతమహిమఁ గల్గి

యలరుచున్నది మమ్ము యీయదియె కన్య
యలరువిల్తుని సమ్మోహనాస్త్ర మనఁగ ౬

మహే—(సంతోషముతో) అలరువిలుతుఁ డను నుపోద్ఘాతముచేత నాతఁడే యీయుమామహేశ్వరులనుగూర్ప సమర్థుఁడని నాకు జ్ఞప్తికి వచ్చినది.

బృహ—(సంతోషముతో)

తే. గీ. జగములను మూఁటి శాసింపఁ జాలునట్టి
మీమనీష యర్జితమాచు మెఱయుచుండుఁ
గరము శాంతికపౌష్టికకర్మములను
యేమరక నిల్చు మాబుద్ధి యెల్లయెడల. ౭

ఎదుచేత నన, నాబుద్ధియు నీయాలోచ ప్రేరుగఁదయ్యె. కావున సత్వరముగా వాని బిలువనంపుము.

మహే—(మంటపద్వారమునుఁ జూచి) ఓరీ! యెవఁడురా యక్కడ?

దేవనంది—(ప్రవేశించి) దేవా, యిదిగో వచ్చినాఁడను.

మహే—దేవనందీ! శీఘ్రముగాఁ గాముని బిలువుము.

దేవ—చిత్తము. (అని నిష్క్రమించుచున్నాఁడు.)

[అంతట రతివసంతులతోఁ గాముఁడు ప్రవేశించుచున్నాఁడు.]

కాము—మిత్రుఁడా, వసంతుఁడా! ఏమి యిది యకాలమునందు స్వామియగు మహేంద్రుఁడు పిలువ నంపినాఁడు?

వసం—నే నిట్లని తలంచుచున్నాఁడను.

చ. మఱపఁగ రానిసేరమున మానిని యెవ్వతెయో మనమ్మునం
జిఱచిఱలాడి తన్ను నిరసించుట రోసముఁ జెంది తా నెకి
మ్మఱఁ బలిమాల నోడి యభిమానవశమ్మున నేఁ డితండు నీ
కఱకగుమోహనాస్త్రమునఁ గాంతమదిం గరఁగింపఁ జూచెనుం. ౮

కాము—అందఱమును దగ్గఱకుఁ బోవుదము. (అని సమీపించుచున్నాఁడు.)

మహే—(గాఁడి సంతోషముతో)—

ఉ. హుమ్మని ముజ్జగంబులను నోరువఁగాఁ దగి మ్రోయుచంచరీ
కమ్ములబారు నారి యయి కాలెడుశిల్పుజమందు మోపి మో
హమ్మున ముగ్ధలొల్కెడు ప్రియాస్యముఁ జూచుచు మెల్లమెల్ల మీ
త్రిమ్మగు నన్వసంతుఁడును దానిటు వచ్చెనుఁ బచ్చవిల్తుఁడున్. ౯

(కాముఁడు రతివసంతులతో సమీపించి చాపగర్భ మగునంజలితో విలాసముగాఁ బ్రణమిల్లుచున్నాఁడు.)

మహేం— (పేఠాంతికమునను జేతితోఁ జూపుచు) మిత్రుఁడా! కాముఁడా! ఇక్కడఁ గూరుచుండుము.

(కాముఁడు రతి వసంతులతోఁ గూరుచున్నాఁడు.)

బృహ— ఓయీ, పూజనీయుఁడవగు నిన్ను మహేంద్రుఁడు మన్నించుట మిగులఁ బొసఁగియున్నది.

కామ— (దోసిలియొగ్గి)

చ. దొరవయి మూఁడుజగంబులకు దోర్బలధుర్యుఁడ వైననీవు ని
ర్జరగులనాథ నా లనఁ జక్కఁబడంగలకార్య మేది సు
స్థిరమగు నైజతేజమున దిగ్వలయంబులు వెల్గఁజేయు భా
స్కరుఁ డొక చిన్నదివ్వెఁ దినకాంతులు చాలక కోరఁబోవునే. ౧౦

బృహ— అలాగనవద్దు.

తే. గీ. మాన్యచరిత యలోకసామాన్యచాప
పాండితి ధరించినట్టి నీబాహు వొకఁడె
వేల్పులనన్నిటిఁ దీర్చి యీయబుధవితతి
కార్య మఖిలమ్ము సాధింపఁగలదుసుమ్ము. ౧౧

మహేం— మిత్రుఁడా! కాముఁడా!

తే. గీ. అచ్యుతునిచక్రమున కసాధ్యమగు నెద్ది
పదను మెఱయునా పవికి దుర్వార మెద్ది
యాపనియె తీరు నీపువ్వుటమ్ము చేత
నోమహానీవెంత భుజబలాఢ్యుఁడవొకాని. ౧౨

కామ— (గర్వముతో) ఎవ్వఁడు నీకు సాపత్న్యము నాచరించుచున్నవాఁడో. యానతిమ్ము.

క. మునియైన దనుజుఁడైనను
మనుజుఁడయిన ముగ్ధ వంద్రి మౌళియె యైనన్
వినుమ మమరాంగనలకటా
క్షపరీక్షణశృంఖలముల఼ఁ గట్టఁబడెడున్. ౧౩

మహే— (బృహస్పతిమొగముఁ జూచుచున్నాఁడు.)

బృహ—ఓయీ, కాముఁడా! ముగ్ధచంద్రమౌళియని పరమార్థమున నీచేత నెవ్వఁడు పరిగణింపఁబడియె నాశంకరుఁ డిప్పుడు మంచుకొండచరియలమీఁద నిరతిశయశీతలాంతఃకరణుఁడై తపముఁ జేయుచున్నాఁడు.

కాము—తరువాత. తరువాత.

బృహ—సౌభాగ్యమయమగు సాలభంజికయుఁ బోలె, విగ్రహమును దాల్చిన సౌందర్యదేవతయో యన సఖీజనపరివృతయై తండ్రియానతిఁ బార్వతి యిపు డాశివుని సేవించుచున్నది

కాము—తరువాత. తరువాత.

బృహ—వారికలయికయందు దేవతలకు మహాకార్యసిద్ధి కలదు. అదియును నీ సహాయము నే కోరుచున్నది.

కాము—(తనలో) తనశక్తి నెఱుఁగమి నరుల కాత్మనాశముఁ దెచ్చునుగదా. ఎందుచేతనన, నాత్మశ్లాఘాపరాయణతఁ బరమేశ్వరుని సామాన్యునిగాఁ బరిగణించితిని.

వన—(తనలో) అనుకొన్న దొకటి జరగిన దొకటి.

తే. గీ. తీవియల్ కమ్మనమ్ముఁ జేదోయిఁ బూని
యేచి యబలలలోఁ జెఱునీతఁ డెచట
విపులలాలాటనయనాగ్నివిస్ఫులింగ
భస్మితపురత్రయుఁడు శూలపాణి యెచట.

రతి—అయ్యో! ఖండపరశుఁడు జయింపఁ దగినవాఁ డనుటచే మాకుఁ గడు ననిష్టము మూఁడినది.

కాము—ఐనను బరిజనులలోఁ గడు నల్పుఁడ నగు నావలనఁగూడ దేవతలు కార్యము నపేక్షించుచున్నారు గావున నే నాత్మనాశకమునైన నొడంబడి యీకార్యము నెరవేర్పఁ బ్రయత్నించెదను.

మహేం—తే. గీ. ఈవు సమ్మోహనాస్త్రంబు నెక్కువెట్టి
నిలుతువేని నిబ్బరమెల్ల నేలఁ గలిపి
మురువు దలకొత్తు గిరిజ నెమ్మొగమువంకఁ
జూడకుండఁగ నాచంద్రజూటు తరమె? ౧౫

అందువలన నీచిన్నకార్యము నుగూర్చి నీవు సందేహ మొందవలదు.

కాము—తే. గీ. ప్రియము లైనను బ్రాణము లీడుచువాఁడ
నీ యమరకార్యమునిమిత్త మిప్పు డేను
జగతి నుపకారు లమలయశశ్శరీర
మంది మృతజీవు లగుచుందు రనఘచరిత. ౧౬

కావున దేవర యెట్లు సెలవొసంగిన నట్లు జేయువాఁడ.

మహేంద్రుఁడును, బృహస్పతియు — (చేరి యెత్తి)

మ. కలుగుం గావుత నీకు మంగళ మహోత్కృశ్రేయము ల్గాశ్చ ది
వ్యులయాశీస్సులు పొసఁగ నిత్య్మ శరముల్ బుంఖానుపుంఖోదయం
బులుగా నీ భుజశక్తి మించుత యశంబు న్వెల్గు లోకత్రయిం
ఫల మొందింపు స్వతంత్రకర్త విధి మావాంఛకు గృపాపూర్ణుఁడై. ౧౭

(కాముఁడు రతివసంతులతో శంకించుచు నిష్క్రమించుచున్నాఁడు.)

మహే — ఆచార్య ! బ్రహ్మ యాదేశమున కనురూపముగ గార్యము మనచేతనే చేయఁబడినది. కార్యసిద్ధినిగూర్చి యదృష్టము కలసివచ్చునని తోఁచుచున్నది.

బృహ — ఔ నది యట్లే.

మహే — స్థాణ్వాశ్రమసమీపమును గూర్చి చనుచున్న కాముని యనంతర వృత్తాంతమును దెలిసికొనుట కెవ్వనినైన నంపఁ బ్రియత్నించెదను.

బృహ — నేనును బ్రస్తుతకార్యసిద్ధికిఁ గులదేవతలఁ బ్రార్థింప నరిగెదను.

(అన నందఱును నిష్క్రమించుచున్నారు)

ఇది ద్వితీయాంకము.

---

## తృతీయాంకము.

(అంతట మహేంద్రుఁడును బృహస్పతియుఁ బ్రవేశించుచున్నారు.)

మహేం — ఆచార్యా ! కాముఁ డెట్టిబాణసాధనమునైన ఖండపరశుని లోఁ బఱుచుకొనునా, లేక సంవర్తనసమయదివకరదుర్నిరీక్షుండైనయామ్మాని దేఁటిదైనం జూడఁజాలక పాఱిపచ్చునా ? అట్లు గాకున్న గోపాంధకారిచేతస్కుండైన యతని ఫాలన యనాలంబునకుఁ బురోడాశ మగునా ? ఎట్లు కాఁగలడో తెలియదు. (ఎడమ కన్నదరుటను సూచించి శంకతో)

తే. గీ. అదరుచున్న దీయెడమకన్నకటకట
యమరకార్యంబు నేభంగినైనఁజెఱుప
సిద్ధము గనున్న విధిపాకుచెయివనులను
గాదితముగనాను నెఱిఁగించునదియుఁబోలె.

బృహ—అమంగళము ప్రతిహతమగుగాక. దేవా! ఈశకునముచేతఁ దద్వృత్తాంత మెఱిఁగినయొకఁడిటు వచ్చునని తోఁచుచున్నది.

(అంతట నారదుఁడు ప్రవేశించుచున్నాఁడు.)

నార—మహేంద్రునియానతిని స్థాణ్వాశ్రమమున కరిగి యచ్చటివృత్తాంత మఖిలమును దెలిసికొని వచ్చితినిగదా. అందుచేత నీతని సమీపించి యచటు నెలకొన్న యుదంత మంతయు నివేదించెదను. (అని నడచుచున్నాఁడు.)

మహేం—(చూచి) ఇదిగో మహతీవల్లభుఁ డగునారదమునియే యిట్లు వచ్చుచున్నాఁడు. అతనికిఁ బీఠము వేయఁబడుఁగాక.

[బృహస్పతి పీఠమును వేయ నారదుఁడు గూర్చున్నాఁడు.]

బృహ—(దోసిలియొగ్గి) వేగఁ బ్రభులకోరిక మంగళమో యమంగళమో సెలవిండు

నార—మొదటినుండి యంతయుఁ జెప్పుదును వినుండు

మహేం—సావధానుఁడనై యున్నాఁడను.

నార—అట్లు దేవకార్యమునిమిత్త మరుగుచున్న మన్మథుని, వృత్తాంతమును దెలిసికొనుతలఁపున మీయాజ్ఞానుసారముగఁ దిరస్కరిణీవిద్యచే వెంబడించితిని.

మహేం—తరువాత తరువాత.

నార—అటు స్థాణ్వాశ్రమముఁ జేరి కాముఁడు వసంతునితో నిట్లనియెను.

మహేం—ఏమని?

నార—"మిత్రుఁడా! ఈహిమవన్నగరప్రాంతకాంతారములయందు నీవు విజృంభింపుము" అని.

మహేం—తరువాత నాతఁ డేమి చేసెను?

నార—చ. పెలుచన గండుఁగోయిలలపింఛులఁ గూయఁగఁ జేసి నవ్వైస
ల్మలయ సమీరకందళము లందల లెత్తఁగఁ జేసి తోన పు
ష్పలుతుని బాహుగర్వమును వేయిమడుంగులు పెంచి యాహిమా
చలవనభూము లందటు వసంతుఁడు కోయని యార్చ రేఁగినన్. ౨

మహేం—తరువాత తరువాత.

నార—తే.గీ. మన్మథుని గండుఁగోయిల ల్మగువ లొసఁగు
తియ్య మామిడిచిగురు లేతేనెఁ గ్రోలి
మనసుఁ గరఁగించుపంచమధ్వనులచేత
నించువిలుకానిగరువంబు మించఁ జేసె. ౩

మహేం—తరువాత తరువాత.

నార — తే.గీ. ఊఁపి చందనభూజంబు లొక్కకొంత
మంచిరేటియలలఁ గౌఁగిలించి కొంత
తమ్మిపూఁదావిఁ గొని కొంత తారసిల్లె
వల్లనల్లన మలయంపుఁ జల్లగాలి. ౪

మహేం — తరువాత తరువాత.

నార — మ. తలిరుల్ డాల్చు రసాలము స్సఖులహస్తస్పర్శము ల్వాసియు
న్గలకంఠీపదతాడనం బెవలియుం గంకేళి పుష్పించెఁ ద
త్కలగానమ్ముఁ దొఱంగియుం దొడిగె మొగ్గల్మొరటుల్కేసరా
ల్వాలపెచ్చుం జవరాండ్రు కల్లుమియకుండం బల్లవించె న్వెసన్. ౫

మహేం — తరువాత తరువాత.

నార — ఉ. తుమ్మెదనారి యొక్కెడినతుంటవిలుం గ్రహియించి కేలఁగ
ర్వమ్మున మంచుకొండపయిఁ బంచశరుండటు లెక్కెనూర్వఁ బా
రమ్మును మీఱి యుట్టి దనరానివికారమొకండుఁ జెందె మో
హమ్మునఁ జిక్కె స్రుక్కెఁ బ్రణయాధికత న్మృగునమ్ములన్నియున్ ౬

మహేం — తరువాత తరువాత.

నార — వేయేల ?

ఉ. ఆదినమందుఁ దవ్వనమునందు వసించెడువారిలో మను
ష్యాదుల గెల్చుసమ్మునులకైనఁ గాంతలయందు ధైర్యమ
ర్యాద నశించునట్టులు మహత్తరమోహపయోనిధాన మెం
డే దరిలేక ముంచె జగమెల్ల క్షణక్షణ వేమిచెప్పుదున్. ౭

మహే — ఈవిధమున సకలజనవికారకారణమై యావలపువెల్లి చెలఁగుచుండఁ గాముఁ డేమిచేసెను;

నార — ఆకాముఁడు రతివసంతు లతనవెంటరా నున్నతదేవదారుఖండమండపము నందు తరక్షుచర్మము పఱచిన చలువఱాలయరుఁగుపైఁ గూరుచుండి యంతర్ముఖనిహితచిత్తవృత్తియు, నభ్యంతరపవననిరోధనిశ్చలాననుండు, నాసాగ్రనిహితపక్ష్మాక్షీధారుఁడు నయి నిస్తరంగ మగురెండవసముద్రముం బోలు నాయిందుశేఖరుం గనుంగొనియె.

మహే — తరువాత? తరువాత?

నార — అనంతరము భగవంతుండగు నీలలోహితుండును జ్ఞాననేత్రముచేత జ్ఞానస్వరూపుఁడగు తన్ను సాక్షాత్కరించుకొని, పర్యంకబంధమును వదలి సమాధిం జాలించెను.

మహేం—తరువాత? తరువాత?

నార—కాముఁడును వాని సందర్శనముచేఁ గరతలమునుండి విల్లు జాఱిపడుట యు నటమీఁదఁ జేయఁదగినపనిఁ జేయఁజాలక చిత్తరుబొమ్మవలె నొక్కక్షణ మూర కుండెను.

మహే—తరువాత? తరువాత?

నార—మ. కృతవాసంతలతాంతభూష యగుచున్ శ్రీకంఠు నర్చింప నా
క్షితిభృత్కన్యక యంతలోన నరుదెంచెం గన్యకామండలాం
చితయై యాతనియున్న చోటికిఁ దపశ్శృంగారవీరాధిదే
వత యొయ్యారము సౌరు నప్పుడఁగాఁ బ్రత్యక్షమైనట్లుగన్. రా

మహే—తరువాత? తరువాత?

నార—పిమ్మట నాపంచబాణుఁడు పట్టుదొరకినవానివలె నిట్టూర్పు నిగిడ్చి దృష్టి కెదురుగాకుండ నాతని వెనుకకుఁ జని యదనుకొఱ కెదురుచూచుచుఁ బొంచి కూరుచుండెను.

మహే—తరువాత?—తరువాత?

నార—పార్వతియు సుఖోపవిష్టుఁడగు నాయష్టమూర్తికిఁ దన యష్టాంగములు నేలఁ దాఁకునట్లు నమస్కరించెను.

మహే—తరువాత? తరువాత?

నార—అనురూపవరునిఁ జేపట్టుమని యామె నాచంద్రమౌళి దీవించెను.

మహే—తరువాత? తరువాత?

నార—తరువాత నాక్షణమునందే యిదియే సమయమని యామదనుఁడు సమ్మోహనాస్త్రమును వింటఁ దొడిగెను.

మహే—తరువాత? తరువాత?

నార—చ. చెలువగు మందహాసరుచిచే వికసించిన చెక్కుటద్దము
ల్గల యుమమోముదమ్మి శితికంధరుఁ డొక్కటఁ జూచెఁ జూచిన
న్వెలఁదియు మైగరుర్పొడువ వెల్లడిసేయుచు భావమెల్ల సి
గ్గలము ముఖేందుబింబము బయల్పడ నించుకనిల్చెఁ జెంగటన్. గా

అంతట భగవంతుండగు ముక్కంటి మనోవికారమును దపోబలముచే నిరోధించి తత్కారణము నరయఁగోరి నలుదెసలం బరికించి చూచెను.

మహే—తరువాత? తరువాత?

నార—చ. కనియెన్ రుద్రుఁడు చంచరీకగుణ మాకర్ణాంతము న్లాగి మో
హన మస్త్రంబు ధనుస్సునం దొడిగి ప్రత్యాలీఢపాదంబునన్

ఘనపూర్వాంగము వంచి ముందుకు భుజాగర్వంబు దీపింపఁగఁ
దనమేనుం గుఱిచేసి యేయుటకుఁ బొంత న్నిల్చుపూవిల్తునిన్. ౧౦

మహే—(భయముచే) అవశిష్టమునుగూడఁ జెప్పుఁడు.

నార—అనంతరము న మహేశపితుఁడైన శూలపాణి ఫాలలోచనమునుండి జ్వాలావళి యనెడు జటలుగలయగ్ని బ్రహ్మాండము నంతను మ్రింగఁదలఁచిన ప్రళయకాలానలమువలె విజృంభించి బయలువెడలెను.

మహే—(దుఃఖముతో) ఇంకమీఁద నేమిచేయుదురో కదా.

నార—ఆపురారాతినయనానలము నకు నామదనుఁడు మిడుత యయ్యెను.

(మహేంద్రుఁడు మూర్ఛిల్ల నారదుఁ డూఱడించుచున్నాఁడు.)

మ—(ఊఱడిల్లి) హా! భువనరమణీయ! పుష్పబాణా! హా సకలజనానందనా! పురందరునిమిత్తము ప్రాణములు విడిచితివిగదా.

బృహ—దేవా విషాదము నొందకుము. కాఁదలఁచినది కాకమానదు. కానిమ్ము

మ—రతి యేమిచేసినది?

నార—రతియును మోహవశయైనది.

మ—వసంతుఁ డేమిచేసెను?

నార—చెలికాఁడగు వసంతుఁడును మోహవశుఁడయ్యెను.

మ—అట్లు మూర్ఛితులగు రతి వసంతు లేమిచేసిరి?

నార—రతియుఁ దనకన్న ము న్నూఱడిల్లిన వసంతుఁడు దన్నాశ్వాసింప నతికష్టముమీఁద నెట్టెట్టో చైతన్యము నొంది యెదుటఁ బరువపవనవికీర్ణబాణపాంసుపటలమై భసితమయమై పురుషాకారముతో నున్న పగని మేను బిగ్గఁగౌఁగిలించుకొని—

తే. గీ. కడచి చనరాని తీవ్రశోకమునఁ గుంగి
ప్రియవిరహిణియాలసముకి పెంటివోలె
నార్తనాదయై విలపించె నంబుజాక్షి
వెడఁదచన్దోయి కన్నీటఁ దడియుచుండ. ౧౧

మ—తరువాత తరువాత.

నార—తదనంతరము హానాధ! హానాథ! యని విలపించుచు రతి నశరీరవాణి యిట్లని యూఱడించెను.

"తే. గీ. విడువు నెవ్వగ నిపుడు పూవిలుతురాణి!
కడచు నెవ్వఁడు విధినియోగము? ధరిత్రిఁ
గ్రమ్మఱ జనింపఁగలఁడు నీప్రాణవిభుఁడు
మారుఁడు పార్వతిఁ బెండ్లాడునవసరమున." అని ౧౨

మ — (ఊఱడిల్లి సంతోషించినట్లు)

తే. గీ. భగ్నమయ్యును నాకోర్కి ప్రథమమందు
మొలకలెత్తెడుఁ గ్రమ్మఱ ముమ్మరముగ
కాఱుచిచ్చున మోడయ్యుఁ గారుమబ్బు
తనుప వెండియుఁ జిగురెత్తు తరువువోలె. ౧౩

బృహ — దేవా! యశరీరవాణి సత్యమయినదియే. సర్వవిధములచేతఁ గాముఁడు పునర్జన్మము నొందఁగలఁడు.

మ — తరువాత నేమిజరిగినది.

నార — అతికష్టముమీఁద నూఱడించి రతిని సమానదుఃఖుఁడైన వసంతుఁడు తన యిలు సేర్చెను.

మ — అట్లు కాముని గథావశేషునిఁగా నొనర్చి కాలకంఠుఁ డేమిచేసెను.

నార — స్త్రీసమీపమును విడువనిచ్ఛతో నా భూతేశ్వరుఁడు భూతగణసమేతముగా నంతర్ధానము నొందెను.

మ — పార్వతి యేమిచేసినది?

నార — తే. గీ. వచ్చి గిరిరాజు సందిటఁ గ్రుచ్చియెత్తి
మూర్ఛపడి కన్నుదమ్ములు మూసికొనిన
కన్నకూఁతును గౌరినిఁ గనికరించి
యల్లనల్లన నూరార్చి యిల్లుసేర్చె. ౧౪

మ — మహాత్మా! నారద! వినఁదగినది వింటిని. ఇటమీఁద మీ రెందరిగెదరు?

నార — ఈవృత్తాంతముఁ గ్రమ్మఱ సత్యలోకనివాసియగు చతుర్ముఖునకు నివేదింప బోయెదను. (అని నిష్క్రమించుచున్నాఁడు)

[అంతట రంభ ప్రవేశించుచున్నది.]

రంభ — (తనలో) కుబేరభవనమునుండి వచ్చుచు నే నోషధిప్రస్థనగరమునందు విన్న వృత్తాంతమును స్వామియగు మహేంద్రునకు విన్నవించెదను.

(అని నడుచుచున్నది.)

మహేం — (చూచి)

ఆ. వె. చంచలతను బాయుచంచలాలత వోలెఁ
దిగ్గ నేర్చుపూవుఁదీవ వోలె
మూర్తిమంతమైన మోహవిద్యయుఁ బోలె
ననుగుదెంచు నీమృగాక్షి యెవతొ. ౧౫

(నిరూపించి) ఇది రంభగదా.

రంభ—(సమీపించి) స్వామికి జయమగుఁగాక! జయమగుఁగాక!

మహే—రంభా! ఎందుండి వచ్చుచున్నావు?

రంభ—కుబేరభవనమునుండి.

మహేం—అచ్చట నపూర్వవృత్తాంత మేమయినఁ గలదా?

రంభ—నీలలోహితుని నిటలానలజ్వాలలచేతఁ గాముఁడు కథావశేషుఁ డయ్యె నని యందఱు జెప్పికొనుచున్నారు. ఇంతియ గాక యోషధిప్రస్థనగరంబున నింకొకవిశేషముఁ గూడఁ గలదు.

మహే—ఆ యింకొక శేమి.

రంభ—కాముదహనముచేత భగ్నమనోరథయగు పార్వతి పరమేశ్వరునే పతిగా నభిలషించి కఠినతపశ్చర్యచేఁ దనమనోరథము నెఱవేర్చుకొనఁ దలఁచుచున్నదని.

మ—ఆ విషయమునఁ దల్లిదండ్రు లేమన్నారు?

రంభ—మేనకాదేవి యిట్లు చెప్పినది.

మ—ఏమని?

రంభ—తే. గీ. తపము చూడంగ నెంతయు దారుణంబు
మేను దిరిసెనపువుఁ బోలె మృదుతరంబు
బిడ్డ! కూడనిపనిఁ దలపెట్టి తీవు
దుష్కరం బిది యంచును దోఁచు నాకు. ౧౬

మ—హిమవంతుఁ డేమనియెను?

రంభ—ఆకార్యము నతఁ డనుమతించెను.

మ—రంభా! మంచివార్తఁ దెచ్చితివే నీవు నీపనిమీఁదఁ బొమ్ము.

రంభ—చిత్తము. (అని నిష్క్రమించుచున్నది.)

(తెరలో)

వైతాళికుఁడు—

మ. తనసైఁ గూరిమి నుజ్జగించి యినుఁ డంతంబోవ దేశాంతరం
బనయం బావిరహాగ్ని కోర్వక సంధ్యాకల్కయై తేంట్లబా
రను రుద్రాక్షలపేరు మేననిడి మ్లాయత్పంకజాతాస్యయై
తనయం బద్మిని తన్నిమిత్తము తపోధర్మంబు గైకొన్నటుల్.

మ—(విని) మేమును సంధ్యావందన మాచరింపఁ బోవుదుము.

(అందఱు నిష్క్రమించుచున్నారు.)

ఇది తృతీయాంకము.

# చతుర్థాంకము.

[అంతట మునివేషముధరించి నంది ప్రవేశించుచున్నాఁడు]

నంది—"నందీ, మన్మథదాహముచేత భగ్నమనోరథయగుపార్వతి నాయందే మనసునిలిపి మహానియమము నాచరించుచున్నది. గౌరీశిఖరమనుపేరుగల తండ్రి శిఖరమునఁ దపముఁజేయుచున్నది. తపము మొదలుపెట్టి చిరకాలమైనది. కాఁబట్టి యిప్పటికి మునివేషముఁ గైకొని నీవరిగి, యామెయొయమ మెట్టిదో, యభిలాషబంధ మెట్టిదో యామె నెచ్చెలులగు జయావిజయలమొగమున నెఱింగి మఱల రమ్ము" అని భగవంతుండగు నీలకంఠునిచే నాజ్ఞాపింపఁబడితినిగదా! అందుచేత స్వామి నియోగమును జేయుదును (అని నడచి విమర్శించి) స్త్రీలమనసులు ప్రకృతికఠినములుగదా! సందేహమేమి?

చ. దిరిసెనపూవుఁబోలె మృదుదేహమునం జెలువారుచున్న యీ
సరసిజనేత్ర చంద్రకళిచాయను గన్నుల కింపుఁ బెంపుచుఁ
స్థిరమతులై శిలాకఠినదేహుల న్మును లాచరించుదు
స్తరతపముం బొనర్పుటకు సందియ మొందక సాహసించెనుగా. ౧

మఱియును—

తే. గీ. హంసతూలికాతల్పంబునందు మున్ను
పండుకొను నీమె పవళించు పట్టినేల
జిలుఁగుదుప్పట్లఁ దొడుగునీ చిగురుఁబోఁడి
కట్టుచున్నది కఠినవల్కలము నేఁడు. ౨

తే. గీ. చాయచందనచర్చలఁ జల్లనైన
విమలధారాగృహంబుల వెలయు నీమె
చేయుచున్నది తపము విశేషనియతి
మంటలెగసెడు పంచాగ్ని మధ్యమందు. ౩

(అంతటఁ గుసుమాపచయము నభినయించుచు జయావిజయలు ప్రవేశించుచున్నారు.)

జయ—సఖీ! విజయా! తపశ్చరణమునందుఁ గృతనిశ్చయురాలగుప్రియసఖిగౌరి మనోరథకల్పవృక్ష మెప్పుడు ఫలించునే?

విజయ—సఖీ! జయా! కాముని గాల్చినపరుషహృదయుండును, నిష్కరుణతకు మొదటియుదాహరణము నగుపరమేశ్వరునిహృదయ మెప్పుడు తగులఁబడునో యప్పుడు ఫలించును. (అని పూవులు కోయుచున్నారు.)

నంది—ఆమె ప్రియసఖు లగుజయావిజయ లిరువురును వీరలై యుండవచ్చును. కావున సమీపించెదను. (అలాగునఁ జేయుచున్నాఁడు.)

జయ—చెలీ నాపూవులసజ్జ నిండినది. నీ దెంతవఱకు నిండినది?

విజయ—(పువ్వులబుట్టనుచూచి) నాపూవులగరిడియ సగము నిండినది. కొంత గూడఁ బూరింపఁగలను. (అని పుష్పకరండమును బూవులతో నిండించుచున్నది.)

నంది—(సమీపించి) మీకు మంగళమగుఁగాక.

ఇద్దఱు—మహాత్మా! నమస్కరించుచున్నారము.

నంది—మీ రెవ్వరు? ఎందుచేతఁ బుష్పాపచయముఁ జేయుచున్నారు?

ఇద్దఱు—మేము హిమవంతునికూఁతు రగుగౌరికిఁ జెలికత్తెలము. తపోనియమము సేయుచున్న యామెకు దేవపూజాపుష్పములను గోయుచున్నాము.

నంది—ఆమెకుఁ దప మెందునిమిత్తము?

జయ—అనురూపవరునిఁ బొందవలయునని.

నంది—ఈయనురూపవరుఁ డెవ్వఁడు?

జయ—తే. గీ. ఆదిపూరుషుఁ డంచు నిత్యుఁ డనంచు
నెవనిఁ బ్రాజ్ఞులెల్లరు నెఱుఁగఁ జేయు
నెవఁడు ధరియించియుండునో యెల్లయపుడు
నీశ్వరాభిఖ్యయును మఱి యిందులేఖ. ౪

ఆపరమేశ్వరునే యీమాప్రియసఖి పతిగా నభిలషించి మహేంద్రప్రముఖు లగులోకపాలుర నవమానించి తపముఁ జేయుచున్నది. అదియుఁగాక మన్మథుఁ గాల్చిన యీశ్వరునందలి వైరమువలనఁ బుట్టినింటికిఁ జని మిగుల నుత్కంఠిత యైనది.

నంది—అది యెట్లో చెప్పుము.

జయ—తే. గీ. మిగులఁ గృశియించి పాలినమేను గల్గి
వంగియుండిన యాననాబ్జంబుఁ గల్గి
చెలువ మఱియుండెఁ బార్వతీనళిని సేఁకు
భవుని విరహంపు గ్రీష్మతాపమునఁ జేసి. ౫

నంది—తరువాత మీసఖి యెట్లున్నది?

జయ—అవ్వలికథ వినుము.

మ. తలిరుంబాన్పుల మెచ్చబోదు మదమందు నీచునాచందనా
చలపుందెమ్మెర సోఁకనీ దలుక హెచ్చం గూరెడుం బంకువె
న్నెలలం దామరపాకుపచ్చడము నేనిం గప్పనీ దౌర మై
చలిగొంచె వ్యసియించుచుం బొరయు నాచంద్రాస్య బల్కంకలన్. ౬

నంది — ఇట్లు ప్రబలమదనజ్వర యగునామె పిమ్మట నేమి చేసినది?

ఇరువురు — అనంతరమున నేవెరవుం గానక తపశ్చరణము జేతం బరమేశ్వరు నక్షి ముఖముగాం జేసికొనం దలంచి తదనుగుణ సుగుతపోనియమమును నెఱపుచున్నయది.

నంది — దుర్లభవస్తు ప్రార్థనానిబంధనముం గలదియు సందిగ్ధఫలము గలదియు నగునీతప మెందుకు? దేవతలలో నెవనినో యొకని ననురూపవరుని గ్రహింపవచ్చును. అఖండపరశుం డున్ననో, కోర్కుల జయించినవారిలో నగ్రేసరుండు. అందుచేతం బ్రియసఖు లగుమీ రామెను హితోపదేశముం జేయుండు.

జయ — మహాత్మా! మాప్రియసఖి నేను బరమేశ్వరునే పతిగాం బడయుదును. అట్లు కానినాం డీశిఖరమునందే కఠినతపశ్చరణముం జేయుచు విలీనురాల నగుదు నని నిశ్చయించుకొన్నది.

నంది — (తనలో) వినదగినది విన్నాండను. ఈవృత్తాంతమును నీలలోహితులకు విన్నవించెద. (ప్రకాశముగా) కన్యకలారా! వచ్చినట్లే నే నరిగెదను.

(అని నిష్క్రమించుచున్నాండు.)

జయ — మేమును బ్రియసఖికిం బూజాపుష్పములకు దీసికొని పోవుచున్నాము.

(అని నిష్క్రమించిరి.)

ఇది మిశ్రవిష్కంభము.

(అంతట నైష్ఠికునివేషమును ధరించి శంకరుండు ప్రవేశించుచున్నాండు)

శంక — (తన్నుం జూచుకొని) ఈవేషము పార్వతిని వంచించుటకుం దగినదే. అదియట్లే.

మ. వెలు ముప్పేటలనూలు మూంపున మెగంపుందోలు హస్తంబున
వ్వలమా మోదుగుంగఱ్ఱ నెన్నొసటిపై భస్మోర్ధ్వపుండ్రంబు నౌ
దలపైం బచ్చనిపెంజడల్ స్ఫటికసూత్రంబొండు ముంజేత న
గ్ఘలతోంగూర్పు పవిత్రమొక్కటియుం గర్ణంబందు శోభిల్లెడున్. ౭

(ఆలోచించి)

మ. వనవిల్తుండటు మోహనాస్త్రమును వింటంగూర్చ సాపత్రపా
ననయై చెక్కులు మందహాసరుచుల న్భాసిల్లంగాం జూపు ల
జ్జను నిట్టట్టుసర న్గనుర్వొడువంగా సర్వాంగ మేక్రొత్తరూ
పునుం గొన్నట్లును నిల్చెనయ్యెడియె యిప్డుం దోంచు నా నెమ్మదిన్. ౮

కాంబట్టి గాఢతరతరణికిరణ సంతప్తమైన మేదినిని, జాతకిని, మేఘుం డనుగ్రహించు భాగునం గఠినతరతపోవిశేషతప్తురాలగు నీమెను నే నిప్పుడే యనుగ్రహించెదను, జయా

విజయులవలన నామె భావబంధము నెఱిఁగి యంది నాకుఁ దెలియఁ జేయుటచే, నెగ్గన
ంచికొనుటకువలె నేను మాఱువేసమును ధరియించుచున్నాను.

(అని వినయముతో నటించుచున్నాఁడు.)

(అంతట జయావిజయలు సేవింపుచుండఁ దపస్సు చేయు
చున్న పార్వతి ప్రవేశించుచున్నది.)

పార్వ — (ఎడమకన్నదరుటను సూచించి) ప్రియసఖులారా !

తే. గీ. సమధికానందబాష్పాళిఁ జల్లనైన
యెడమకన్నిప్పు డదరు నిర్హేతుకముగ
మందభాగ్యురాలను నాకు నిందువలనఁ
గలుగఁదలఁచిన శుభమేమొ తెలియరాదు.

జయ — ఓసఖీ ! పార్వతీ! స్త్రీల కెడమకన్నదరుటయుఁ బురుషులకుఁ గుడి
కన్నదరుటయు సుశకునము లని పౌరాణికులు చెప్పుదురు. అట్లు మన్మథదాహమున
నిష్కారణముగ నయ్యెఁ బరమేశ్వరుఁ డే మునిముఖముననో నిన్ననుగ్రహింపఁగలఁడు.

పార్వ — ప్రియసఖివచనము సత్యమగుఁగాక.

విజయ — చెలియగు జయ నిజముచెప్పినది.

శంక — (పార్వతింజూచి)

క. ఇక్కలికి కోమలాంగం
బెక్కడి దారుణము నియమ మెక్కడిఁ సెగలం
గ్రొక్కెడు గ్రీష్మం బెక్కడ
నెక్కడి నవజమృదులహిమకరకళయు- ౧౦

అహో! యీమంజుభాషిణి నన్నుద్దేశించి యెంతయుఁ దపఃక్లేశ మనుభవింపుచున్నది.

జయ — (చూచి) సఖీ పార్వతీ ! మూర్తీభవించిన బ్రహ్మచర్యమువలె నొకలేఁ
బ్రాయంపుమహాపురుషుఁ డిటు మొగమై వచ్చుచున్నాఁడు.

పార్వ — అతిథులై వచ్చిన మహర్షులను మీరు పూజసేయఁదగును. నేనెప్పటివలె
నియమమును నెఱపెదను. (అని మౌనము నవలంబించుచున్నది.)

శంక — (చూచి)

తే. గీ. పఱఁతి మద్విరహవ్యథఁ బాలిపోయి
చెన్ను వహించు నిదె నారచీరఁ గట్టి
లేఁతసంజకెంజాయలో లీన మగుచుఁ
దనరుపాడ్యమినాటిచంద్రికళవోలె. ౧౧

(అని సమీపమునకుఁ బోవుచున్నాఁడు.)

(జయావిజయలు పీఠమును దెచ్చుచున్నారు. శంకరుఁడు గూరుచుండి మార్గాయాసము నభినయించుచున్నాఁడు.)
[పార్వతి చెలికత్తెలఁ జూచుచున్నది. సఖులు బ్రహ్మచారికి వీవనల విసరుచున్నారు.]

శంక — (చేయియెత్తి) అనన్యసామాన్యమగు మీసౌజన్యముచేతనే మాయాయాసము పోయినది

ఇరువురు — (విస్మయముతో) మహాపురుషు లెందుండి వచ్చుచున్నారు ?

శంక — ఇపుడు కైలాసమునుండి వచ్చుచున్నాము.

జయ — అట్లయిన మహాపురుషుఁ డర్ఘ్యమును గ్రహించుఁగాక.

శంక — మంచిది. (అని యర్ఘ్యమును గ్రహించుట నభినయించి) కల్యాణులారా ! మిమ్మొకమాట యడుగ నభిలషించుచున్నాము.

జయ — మహాత్ములకుసుమరుగాక .

శంక — ఈమె యెవ్వనికూఁతురు ? మీ రెవ్వరు ? ఎందునిమిత్త మీమె కఠిన తపముఁ జేయుచున్నది ?

జయ — ఈమె మాప్రియసఖి ; హిమవంతునికూఁతురు ; పార్వతి యనుపేరు గలది ; మే మామెకుఁ బ్రియసఖులము ; జయావిజయ లనువారము. అనురూపవర లాభము నిమిత్త మీమె యీతపముఁ జేయుచున్నది.

శంక — చ. జననము వేల్పుపెద్దయగు సారసగర్భుని సత్కులంబున ;
జనకుఁడు పూజనీయుఁడగు సర్వకులాచలభర్త. మూర్తి సె
మ్మనము హరింపఁజాలునది; మాటలు ముద్దులమాట ; లిట్టు ల
య్యంగ్యను విరిబోడియున్న వితమొక్కటియే యతిలోకమయ్యెడు. ౧౨

అయిన నీ ముజ్జగములలో నీమెఁ గోరఁదగిన వరుఁ డెవ్వఁడు ?

జయ — ఉన్నాఁ డొక మహాపురుషుఁడు.

శంక — తనయందముఁ జూచుకొని యంత గర్వించిన యాకఠినచిత్తుఁ డెవఁడు?

జయ — మహాత్మా ! వినుండు ; (తే. గీ. "ఆదిపూరుషుఁడంచు నిత్యయువయంచు" అనుపద్యమును జదివి) ఆపరమేశ్వరునే యభిలషించినదై మాప్రియసఖి తపోనియమమును జరపుచున్నది.

శంక — (పార్వతితో) కల్యాణీ ! ఇది నిజమేనా ?

పార్వ — (మౌనమును విడిచి) మహాత్మా ! సఖులచేత నెట్లు చెప్పఁబడినదో యట్లె నామనోరథ మున్నది.

శంక — (తనలో) ఇపుడు నన్ను నేను నిందించుకొని యీమె మనస్స్థైర్యమును బరీక్షించెదను. (ప్రకాశముగాఁ జప్పటలుగొట్టి నవ్వి.)

చ. భసితము మేనిపూఁత పెనుపాము విభూషణ మాశ్మశానమే
బస పరిచారికాగణము పాఁసుపిశాచము లెవ్వ భిక్షువై
మసలుట వృత్తి; యిట్టెయెఁ డమంగళచిహ్నలఁ దాల్చునంధు స
ర్వసుజను లెంతు రాపురుషుపై మది నిల్పితి వేమి చెప్పఁదున్. ౧౩

మఱియును.—

చ. వికచపయోజగుల్మ్యసుఖి విశ్వజగత్త్రయనేత్రి బాలచం
ద్రిక హిమవన్మహాధరణిభృత్కులరత్నమ వేఁడి నీవు పా
యక పులితోలు గట్టి యనయంబు వసించుచు వల్లకాటిలో
దకట యమంగళాత్ముఁ డగునాశితికంధరుఁ డేఁడఁ జెప్పుమా. ౧౪

పార్వతి—(చెవులు మూసికొని) పాపము శమించునుగాక. పాపము శమించునుగాక.

శంక—ఈగ్రహమున నీవు మనసునందు నిశ్చయించుకొనిన పక్షమున నింకే—

క. పిరభోఁడి యామాహాత్మ్యము
వరుఁగా నీవు పడయంగవచ్చును జుమ్మీ
యరియగు రాహువునోటం
జొరఁబడ నాచంద్రరేఖ చూచెదు నేనిన్. ౧౫

పార్వతి—(ముఖవైవర్త్యమునిరూపించి)

తే. గీ. ప్రాఁజదువులెల్ల మూళిచే వందనంబు
లేమహాత్మున కొనరించు నామహాత్ము
నిందన మొనర్పఁగడఁగిన నీదునాల్క
పగులదదియేమి యొకవేయి వ్రక్కలుగను. ౧౬

ఓసీ సఖీ! మహాపురుషనింద వినువారికిఁ జేయువారికన్న నెక్కుడుదోషము గల్గును జుమా. ఇతఁడు బ్రాహ్మణుఁడు, చేయునది నిరంతరాళమగు నీశ్వరనింద; కాఁబట్టి వేఱొకతావునకుఁ బోవుదము.

(అని జాఱుచున్న వల్కలముతో మఱియొకచోటికిఁ బోవుచున్నది)

శంక—(స్వరూపమునుజూపి)

తే. గీ. గుత్తమగు నీదుచందోయి గొప్పబరువు
ముదిత నిరుపేదకౌనెట్లు మోయనోపు
నీకుఁ జేయూఁతయొసఁగెదు నేర్పుగల్గు
దాసజనుఁడైతిఁజుమి నీదు తపము మెచ్చి.

(అని పార్వతి హస్తముఁ బట్టుకొనుచున్నాఁడు.)

పార్వ — (భయవిస్మయప్రహర్షములఁ దనువు పులకింపఁ జెక్కులు చెమర్ప నేమి యుఁ దోఁచకున్నది.)

జయ — పుణ్యవశమునఁ బరమేశ్వరుఁడు సన్నిహితుఁ డయ్యె నిది మాకత్యానంద మత్యానందము.

శంక — చ. అలపటచేత సంజనితమౌ చిఱుచెమ్మటఁ గల్గి యంకుర

త్పులకసమూహము ల్గలిగి తోరపునాఁ గయిసేయఁబడ్డయౌ

జ్జ్వలపుచమండలిం గలిగి భాసిలుచున్న భవల్లతాంగనౌ

యలికులవేణి నెమ్మనము హాయిగఁ బిగ్గఁ గవుంగిలించెదన్. ౧౭

అందువలన నీమెను గాంధర్వవివాహమునఁ బాణిగ్రహణముఁ జేయనభిలషించుచున్నాను.

జయ — మహాత్మా! సకలకులాచలచక్రవర్తియు నీమె తండ్రియునగు హిమవంతుని గృహమున జరుగు వివాహకార్యమున కరుదెంచి యీమెను గ్రహింపుమని మేము వేఁడుకొనుచున్నారము. మా ముద్దుఁ జెల్లింపవలయును.

శంక — (విసుగుతో తనలో) ఇంక నేనెట్లు తాళఁగలను. (ప్రకాశముగా) మంచిది లోకాచారమును దాటఁగూడదు గదా.

జయ — అయిదుదినములలో వివాహ మెట్లగునో యట్లు జాగ్రత్త పెట్టెదము.

శంక — మూఁడు నాలుగుదినము లనుము. అది యుక్తమే.

గీ. ఉవిద నెడఁబాసియుంటలో నొక్కక్షణమె

యగుచు నున్నది కల్పసహస్రకోటి

కొన్ని నాళ్ళలో జరగంగ నున్నదీని

నెట్లు సహియింపనోపు నాహృదయమకట.

జయ — వివాహమంగళసంపాదనమునకు మేమింకఁ బోవుదుము.

శంక — అలాగే చేయుఁడు. మేమును సప్తర్షులను వివాహమంగళముకొఱకుఁ బంపఁబోవుచున్నాము.

(అని సందఱును నిష్క్రమించుచున్నారు.)

ఇది చతుర్థాంకము.

---

# పంచమాంకము.

---

[అంతటఁ గంచుకి ప్రవేశించుచున్నాఁడు.]

కంచు — "శిలాధరీ! పరమేశ్వరునిచే వరియింపఁబడి యరుంధతీసమేతులై సప్తర్షులు నిన్నటిదినమునుండే వచ్చి లబ్ధవర యయినవస్సు కీదినము వివాహమంగళయోగ్యమని నిర్ణయించిరి. అందుచేత నోషధిప్రస్థనివాసులగు పౌరులకు నగరమంతయు నలంకరించునట్లు నీవు నియోగింపుము" అని సకలకులాచలచక్రవర్తి యగు హిమవంతుఁడు నాకానతిచ్చినాఁడుగదా? కావున స్వామి నియోగమును నిర్వర్తించెదను. (అని నడచి యంతటఁ జూచి)

ఓహో పౌరులారా!

చ. ప్రతిగృహతోరణప్రతతి రమ్యగతి న్గయిసేయరే, మహో
 ద్ధతి మినుముట్టఁ గేతనపతాకల నెత్తరె, పూలఁ జల్లియం
 చితగతిఁ జందనద్రవము చిల్కరె వీథుల నన్నిట న్జగ
 ద్ధితముగఁ బెండ్లి యయ్యెడును మహీధరరాజతనూజ కిప్పుడే.

(ఆకాశమువంకఁ జూచి) ఏమనుచున్నారు? మీరు చెప్పకమునుపే సర్వము ద్విగుణముగ మాచేత రచింపఁబడినదనియా? (అంతటఁ గనుఁగొని) అహో మాయాజ్ఞకుఁ బూర్వమే నగరము ప్రవృత్తమహోత్సవ మయ్యెను. అదిగో.

చ. పొలుపు దలిర్ప పొన్నవఁటిబోదెలునాటి యమర్చు ద్వారసీ
 మల నవచూతపల్లవసమంచితతోరణరాజి యొప్పఁగా, మ
 ర్దళములు మ్రోయఁ శ్రావ్యగతి, రమ్యగతి ధ్వనిసేయుఁ వీణలుఁ
 వెలవెలఁదు ల్వగ ల్మెరయ నృత్య మొనర్తురు నిండువేడుకన్.

ఈవైపున.

తే. గీ. మిగుల వ్యాపించెడు నగరుపొగలచేతఁ
 గలుగుచున్నది క్రొమ్మబ్బుకారు నేఁడు
 ద్వారములఁ జెక్కఁబడె నవరత్నములచేత
 జననమొందుచున్నది యింద్రచాపకాంతి.

ఇదిగో నీవైపున.

క. తెలుపై, యెఱుపై, నలుపై
 పొలయుచుపొంగములవింత మ్రుగ్గుల నిడుచు

న్వాలుపకుచంబుల బంగరు
కలశకుమ్మల నినుమడింపుగ్రి గద యిందుముఖుల్.

(అంతటఁ జూచి)

తే. గీ. కనకరజముశోభను పిశంగరుచిదాల్చ
కుంకుమపరాగమునఁ దారకోటి చల్ల
నన్నిదిక్కుల వ్యాపించి యది యొసంగు
నుదయకాలపుగ్రిభాకరునోజుపు పురికి.

అందుచేత జరగుచున్న యీపురాలంకారమును స్వామికి నివేదించెదను.

(అని నిష్క్రమించుచున్నాఁడు)

(అంతట నిజాస్థానమున నున్న హిమవంతుఁడు ప్రవేశించుచున్నాఁడు.)

హిమ — చ. నారదసూనవం బలిసినాఁడను మున్నె మహేశ్వరుండు నా
కూఁమి యల్లుఁడౌట మదిఁగోరితి నాతనిరాక యింతకు-
గౌరపంబుచే నతఁడు నాకు లభించెను నేఁడె పెండ్లి సే
యు తెలుపు నంతరాయములుమాఁద గతించె నదృష్టవంతుఁడన్

(అంతట, శిలాధరుఁడు ప్రవేశించుచున్నాఁడు.)

శిలా — (దగ్గఱకువచ్చి) స్వామికి జయమగుఁగాక.

హిమ — శిలాధరా! నీవు నగరమంతయు నలంకరింపఁ జేసితివా?

శిలా — దేవా! ప్రత్యేకముగాఁ బౌరు లందఱు "నీయుత్సవము స్వకీయమని యభిమానించుకొనుచుండ నగరాలంకార మెట్లు తక్కువగును? అంతయు బౌరులచేత నినుమడిగఁ జేయఁబడినది.

హిమ — శిలాధరా! పార్వతీపరిణయమహోత్సవమును దర్శించుటకు సర్వపర్వతకులంబు వచ్చినదా?

శిలా — స్వామీ! అవధరింపుముగాక.

మ. అవనీరంజనకల్ప కాకృతిసురాహార్యంబు కవ్వింపుఁ దాగ్రి
పువు నాగేంద్రుగ్రిని మేనిరాపిడిని నుప్పమందరాగంబు ను
ద్దప్రిప న్నృగములం దిశేంపగ్రిపక్షరోగ్రంబైన వింధ్యాదిగ్రి వ
చ్చె వెసన్నిన్గన గంధమాదనముఖు ల్సేవింప శైలాధిపా.

హిమ — అట్లయినఁ గైలాసగిరి యేమి చేయుచున్నవాఁడు?

శిలా — దేవా! అతఁడు పెండ్లికొడుకువైపుగనుక వారితోఁ గలిసివచ్చుచున్నవాఁడు.

హిమ — సరే. అయిన విశ్వావసుపగ్రిభృతులగు గంధర్వులు వధూగణముతోఁ గూడ నరుగుదెంచిరా?

శిలా — క. చనుదెంచిరి గంధర్వులు
వనితలతోఁ గూడి వేల వల్లకు లలర
న్ఘనమగు నుత్సవసమయ
మ్మునగానముఁజేసి నిన్ను మదిశునిఁజేయన్.

హిమ — అమరులతోఁ గూడ నచ్చరలు వచ్చిరా?

శిలా — వినుండు.

మ. నవచంచల్లతికాప్రభ ల్నభమున న్మెచ్చాయి నిర్మించి క
న్గవశీపిం దెసలందు నుత్పలములు ల్గప్పించుచు న్మందహా
సవిలాసమ్మున వెన్నెల ల్పగలు దిగ్జాలమ్మున న్నించుచుం
దివిజానీకముతోడం వచ్చి రిదె పేర్మిన్ స్వర్గనారాంగనల్.

హిమ — శిలాధరా! అట్లయిన నీవంతిపురమున కరిగి కల్యాణయగు కౌశికితో వచ్చిన యచ్చరలచేత వధ్వయగు పార్వతిని నగ్గిఱనుండి యలంకరింపఁ జేయుమనియు, నాయలంకారపరికారమంతయుఁ దెచ్చి నాకుఁ దెలియఁ జేయుమనియుఁ జెప్పుము. అదియునుఁగాక వచ్చినవధూజనములకును బర్వతకులములకును సత్కారమొనర్చుటకు సకల లోకవస్తుసంభారములను నీవు సిద్ధము సేయుము.

శిలా — దేవరవారిచేత నాజ్ఞాపింపఁబడిన ట్లంతయుఁ జేసెద.

(అని నిష్క్రమించెను).

(నారదుఁడు ప్రవేశించి)

తే. గీ. వెనుక మనసార నేఁ దలపెట్టినట్టి
ఘనవిరంబైన నిర్జరకార్య మిపుడు
దృఢతరాంతరాయముల నతిక్రమించి
చిత్రవైఖరి ఫలియింప సిద్ధమయ్యె.

(అని నడచి చూచి) అదిగో హిమవంతుఁడు వివాహమంటపముపైఁ గూరుచున్నాఁడు. అతని సమీపించెదను. (అని దగ్గఱకుఁ బోవుచున్నాఁడు.)

హిమ — (చూచి) అదిగో నారదుఁడు (అని దోసిలి యొగ్గుచున్నాఁడు.)

నార — హిమవంతుఁడా! పూజ్యుఁడవగు నీ కభ్యుదయమే?

హిమ — ఇది మీరు నాటినబీజమునకు ఫలమే. (అని పాదము వేయుచున్నాఁడు)

నార — (చూచుచున్నాఁడు.)

(అంతటఁ గౌశికి ప్రవేశించి కూరుచుండి పార్వతీపరికర్మ ప్రకారము చెప్పుచున్నది.)

హిమ — అమ్మా! వత్స యలంకరింపఁబడినదా?

కౌశి — దేవా! చెప్పుచున్నాను. అంతయు వినుండు.

హిమ — అవహితుఁడనై యున్నాను.

కౌశి — క. అసమశ్రీభూషయై తను
వసనము ధరియించుకొన్న పసుఁతుక మేన
న్వాస గుమగుమయను తావులు
గసరెను తైలంబు రాసి కనకతోడన్.

హిమ — తరువాత. తరువాత

కౌశి — తే. గీ. మేలిరతనాలగద్దియమీఁద నునిచి
వేల్పుకోటికి గులతోడ వెలఁదులెల్ల
మంగళస్నాతఁజేసిరి మగువ నంతఁ
దుములమై శుభశంఖనాదము చెలంగ.

హిమ — తరువాత. తరువాత.

కౌశి — చ. చారునిమజ్జనమ్మునను స్వచ్ఛతగాంచిన యాలతాంగి క
ర్పూరపరాగపాండురతఁబొల్చెడు దువ్వలువల్ ధరించెనై
నీడరంజిచేఁ గనువినిర్మలమై తనరారు నింగి యా
శారదశర్వరీరమణచంద్రికలన్ ధరియించుకైవడిన్.

హిమ — తరువాత. తరువాత.

కౌశి — తే. గీ. లలన చరణరాజీవంబు లక్కయానను
లేఁత నీరెండపూఁత చలిర్చుచుండె
నీలమణి నూపురంబుల సొపనుచేత
గండుతుమ్మెద బారందుఁ గ్రమ్ముకొనియె.

హిమ — తరువాత. తరువాత.

కౌశి — తే. గీ. పంచి తనాలమొలనూలు మించుఁబోఁడి
ఘనతరనితంబసీమను గట్టఁబడియె
మిన్నువాఁకలోని యిసుకతిన్నెమీఁద
తీరితుంచిన బెగ్గురుబారువోలె.

హిమ — తరువాత. తరువాత.

కాశి—అయ్యో!

తే. గీ. కుంకుమచేతఁ గెంపారు కుచయుగంబున
కరయుగముతోడ నక్షత్రసరముఁ గట్టి
రక్తసిందూరరజముచే నరుణమైన
యాముకేమఁగు కుంభంబునందుఁ బోలె.

హిమ—తరువాత. తరువాత.

కాశి—అయ్యో!

తే. గీ. సొగసుకాణాచి రతనాలనగల తావు
నగుమఁ దనరారుచున్న యాయతివనీను
పుష్పరత్నసంతతితోడఁ బొలుపుమీఱు
శంఖనిధి నించుకేనియుఁ సరకుగొనదు.

హిమ—తరువాత. తరువాత.

కాశి—తే.గీ. జలజలోచనకర్ణపార్శ్వములయందు
గూంచి ముత్యాలకమ్మ లమర్పఁబడియె
వీనుల వదనపద్మంబు సేవింపవచ్చు
చంద్రమండలద్వితయంబు చందమునను.

హిమ—తరువాత. తరువాత.

కాశి—తే.గీ. కమలపత్రాక్షి తెలిసోగకన్నుఁగవకుఁ
గాటుకను దిద్దుతఱిఁ జెలికత్తెచేయి
పెద్దయుంబొద్దు నెమ్మె నెమ్మె విశ్రమించి
చివరకెట్టకో కెంగంటిచెంతఁ జేరె.

హిమ—తరువాత. తరువాత.

కాశి—తే.గీ. కాంచనాంగి లలాటభాగంబునందు
గన్యయామమైన మంచిగంధంపుబొట్టు
దిద్దినదియయ్యె విపులకాంతిప్రదముగ
నునుమసాయను తెలుపొందు సబ్బుగోముగ.

హిమ—తరువాత. తరువాత.

కాశి—తే.గీ. మవవులను దాఁచుచున్నట్టి మగవశులు
మృదులమందారకుసుమగర్భితమనోజ్ఞ

వేణికాబంధముగఁ జుట్టి పెద్దపొద్దు
కన్నుమూయక చూచిరి కాంతలెల్ల.

హిమ — తరువాత. తరువాత.

కాళి — తే.గీ. మేనితోడవు లంగములకు మెఱుఁగు దెచ్చు
ననుట లోకప్రవాదమే యగునుగాని
యరసిచూడంగఁ బూఁబోఁడి యంగకములె
భూషణమ్ముల కొక వింతమెఱుఁగు దెచ్చె.

హిమ — ఇట్లయిన వత్స మీసాన్నిధ్యవిశేషముచేతనే యంతలెస్సగా నలంకరింపఁబడినది.

(తెరలో)

మ. విలుఠన్మందరకందరాహతివలద్విస్తారదుగ్ధాబ్ధిగ
ర్భలసద్వీచిపరంపరార్భటులకున్ వైతండికంబై గొద
స్థలశైలేంద్రగుహల్ ప్రతిధ్వనుల సంక్షోభంబు నొందంగ ని
శ్చలనాదంబయి మ్రోగు నొక్క సురనిస్సాణంబు సాటోపమై.

(అందఱు తొందరతో నాలకించుచున్నారు.)

[మరలఁ దెరలో]

మ. చను పార్శ్వంబున నింద్రఁ! తోఁ జనుమా చక్రి విధీ చెప్పు స్వ
స్తిని; వేపల్కరె రుద్రబుభుక్షులు మునుల్! శేషాహిభర్తృమ్ముగ
మ్మిన శీతాంశులు చామరంబులిడరే; హ్యాత్రీపతిగా రండికన్
మునుమున్ రుద్రగణంబ! యోపవన యింపుల్ పుట్ట వీవంగదే.

హిమ — మహాత్మ! నారద! దేవతల కోలాహలమువలె వినంబడుచున్నదేమి?

నార — సకలజగదుత్పత్తిస్థితిప్రళయప్రకటీకృత మహామహిముఁడై సకల చరాచరగురుఁడై యున్న వియ్యల్లుఁడు శుభవివాహవేషముతో నిటే వచ్చుచున్నాఁడు. ఈమహాకలకల మాతనిముందు నడుచుచున్న నందీశ్వరుని ప్రోత్సారణధ్వని. కావున నీవర్ఘ్యపాణివై భగవంతుఁ డగు నిందుశేఖరు నెదుర్కొనుము.

[వివాహవేషమును ధరించిన శంకరుఁడును దేవసంఘమునుఁ బ్రవేశించుచున్నారు.]

శంకరుఁడు — (విష్ణుతో) ఈయోషధిప్రస్థనగర మమరావతికన్న మిన్న శోభిల్లుచున్నది.

విష్ణు — మహేంద్రునికన్న మహీధరుఁడు తక్కువవాఁడా యేమి ?

హిమ — (అర్ఘ్యపాణియై సమీపించుచున్నాఁడు.)

శంక — (చూచి) శైలరాజు నన్నెదుర్కొనుచున్నాఁడు. కావున వాహనము దిగిపోదము. (అని అట్లు చేయుచున్నాఁడు.)

హిమ — తే. గీ. గోచరుఁడుగాఁడ చర్మచక్షులకు నే న
పౌరుషేయ వాక్కులకేనిఁ బట్టనంది
యెవ్వఁడాహరునల్లగా నిపుడు పహేయ
నెన్ని పున్నెము ల్సలిపితి మున్ను నేను.

(అని సమీపించుచున్నాఁడు.)

శంక — (చూచి)

తే. గీ. అతిభరంబైన చరణవిన్యాసమునను
క్షితిని నిమ్నోన్నతముబలెఁ జేసి శిరయ
సరణిఁ దనవారలకు నేర్పకరణి నదిగొ
న న్నెదుర్కొనుచున్నాఁడు నగవిభుండు.

(అని యెదురుగా వచ్చుచున్నాఁడు)

హిమ — (అర్ఘ్యమిచ్చుచున్నాఁడు.)

శంక — (సప్రణామముగా గ్రహించుచున్నాఁడు.)

హిమ — (సిగ్గుతో తలవంచుచున్నాఁడు.)

(అట్లుని ముందుంచుకొని హార వింంచి ప్రముఖులు నడచుచున్నారు.)

బృహ — మహాత్మా ! వివాహమంటప మెక్కడ ?

హిమ — ఆచార్యా ! ఇక్కడ నిక్కడ.

(అందఱును బోవుచున్నారు)

బృహ — హిమవానుఁడా ! సుముహూర్తము సమీపించినది. అందుచేతఁ బెండ్లి ను దోడ్కొనిరమ్ము.

హిమ — (తెరవంకఁ దిరిగిచూచి) అమ్మా ! ఇటు; ఇటు.

[అంతట జయావిజయలతోఁ బార్వతి ప్రవేశించుచున్నది.]

పార్వతి — (తనలో) నేఁడేగదా నామనోరథకల్పద్రుమము ఫలియించును.

జయ — (నవ్వుచు) చెలీ ! పార్వతీ ! ఇంకనుఁ దే మేము నీచెలికత్తెలముగా.

పార్వతి—(అసూయతో) ఓసీ! విజయా! ఇది యేమనుచున్నదే?

విజయ—సఖీ పార్వతీ! ఈమె సరసాలాపకుశలత్వముం జూపుచున్నది.

(అని సమీపించుచున్నది.)

బ్రహ్మ—(విష్ణుతో) మహాత్మా! దేవతలందఱు భూతగణముతో సముచితాసనములం గూరుచుందురుగాక.

(అందఱు నట్లు చేయుచున్నారు.)

హిమ— మాపైపున వచ్చిన కులపర్వతములు! కైలాసముతో నెడమప్రక్కం గూరుచుండుఁడు. (కులపర్వతము లట్లు చేయుచున్నవి.)

శంక—(పార్వతిం జూచి తనలో)

తే. గీ. మోహన వివాహవేషంబుఁ బూనుకతన
సొబగుమీఱు నీయెలనాగమూపుచేత
నామనంబందునారు మన్మథసహస్రములను
గల్పించుచున్నదివోలెం బొలుచుచుండె.

బృహ—శంకరా! పెండ్లికొమార్తెతో నీవీవేదికమీఁదం దూరుపు మొగముగాం గూరుచుండుము.

(శంకరుఁడు పార్వతీసమేతముగాఁ గూరుచున్నాఁడు.)

శంక—(తనలో)

తే. గీ. అసమలావణ్యకౌముదీవిసర యగుచుం
గూర్చిపంచు నేత్రచకోరములను
యీముదిత మేరదాఁటించు నామనమును
చంద్రిమకళ యాదుగ్ధజలధినట్లు.

బృహ—(అగ్నిని ప్రజ్వలింపఁజేసి) శంకరా! నీచేతితోఁ బార్వతిహస్తమును బట్టుకొమ్ము.

శంక—(అట్లు చేయుచున్నాఁడు.)

పార్వతి—(పులకోద్భేదము నభినయించుచున్నది.)

శంక—(తనలో)

తే. గీ. కేలువట్టినమాత్రన నీలతాంగి
పులకరించినయంగము ల్గనిగి పొలిచె

నభినవవసంతసమయసమాగమమున
మొగ్గదొడిగిన క్రొమ్మావిమోకవోలె.

బృహ—వధూవరు లగ్నిహోత్రునకుఁ బ్రదక్షిణ మొనర్తురుగాక.

(ఇద్దఱు నట్లు చేయుచున్నారు.)

పార్వతి—(శంకరునిఁ జూచుచున్నది.)
శంక—(పార్వతినిఁ జూచుచున్నాఁడు.)
పార్వతి—(దృష్టి మరలించుచున్నది.)
శంక—(తనలో)

తే. గీ. చూడఁ దమకించుచున్న యీసుదతిదృష్టి
మాటిమాటికి సిగ్గున మరలుచుండె.
మొదల నేటినీటివఱద కెదురుపోయి
మరలివచ్చెడు బేడిసమాడ్కిఁ దనరి.

బృహ—(పార్వతిచేతిచే లాజహోమముఁ జేయించుచున్నాఁడు.)
పార్వతి—(పొగగ్రమ్ముటచే శ్రమ నభినయించుచున్నది.)
శం—(తనలో)

ఉ. చెమ్మటచేతఁ బత్త్రములు చెక్కులపై దిగజారఁగాఁ బొగ
ల్గ్రమ్ముటఁ గాటుకల్గరఁగి కన్గవర క్తిమఁ జూపఁగా విలా
సమ్మునకై ధరించినవస తలతాంతము వాడ నీమె యా
స్యమ్ము మదీయచిత్తమున సల్పు నొకానొక రాగముద్రణ

బృహ—శంకరా! నీవుపార్వతీపాదపద్మమును జేతులతో సన్నికంటివీఁద నుంచుము.

శంక—(చిఱునగవు మొగముతో నూరకున్నాఁడు.)
కులపర్వతములు—(సంభ్రమముతో)

మహాత్మా! ప్రమాణభూతుఁడగు పురోహితుఁ డాజ్ఞాపించినట్లు చేయవలయును.

భూతగణము—(సంరంభముతో) కులగిరులారా! త్రిలోకనియంతయగు భగవంతుఁడు నీలలోహితుఁ డెట్లాజ్ఞాపింపఁబడుచున్నాఁడు?

బ్రహ్మ—(నవ్వుచు నుభయులను వారించి) సర్వజననియామకము, స్వతఃప్రమాణభూతమునగు వేదమే యిట్లు విధించుచున్నది. కావునఁ జెప్పినట్లు చేయుము.

శంక — (ముడుచుకొన్న చేతులతోఁ బార్వతీపాదపద్మమును సన్నికంటె మోపుచున్నాఁడు.)

బృహ — (విధిశేషమును సమాప్తముచేయుచున్నాఁడు.)

(శంకరుఁడుఁ బార్వతి యు బ్రహ్మకు నమస్కరించుచున్నారు.)

బ్రహ్మ — (చేయెత్తి)

తే. గీ. అన్ని జగముల సలితంబులై నమీరు
నెగడుచు ననన్యసులభమౌ నిండుప్రేమ
భువనజాలార్తిహరమూర్తి బొసఁగుఁగాత
తారకధ్వంసియైనసుమారుఁ డొకఁడు.

(అని దీవించుచున్నాఁడు.)

వృద్ధస్త్రీలు — (ప్రవేశించి)

తే. గీ. ఒండొరులకుఁ దుల్యసురూపయుతుల రగుచు
నతులబద్ధానురాగులైనట్టి మీరు
వెన్నెలకుఁ జందమామకు వెలయురీతి
యిట్టిదనరాని యొక ప్రేమ పుట్టుఁగాత.

(అని యక్షింతలు చల్లుచున్నారు.)

నార — (లేచి దోసిలియొగ్గి) దేవా! దేవకార్యమునిమిత్త మపరాధ మొనర్చి మన్మథుని మరల శరీరధారిగను దమ చరణారవింద సేవకునిగను ననుగ్రహింపుము.

శంక — మీకెట్టు లిష్టమో యటు లగుఁగాక!

(అంతట రతీవసంతులతోఁ బూర్వాధికవిగ్రహుఁడై కాముఁడు ప్రవేశించుచున్నాఁడు.)

అందఱు —

మ. వలపుం దియ్యఁదనంపు విల్లు మహితభల్లంబు విశ్వాల రా
జిల నమ్మాధవుచేయిపట్టుకొని వచ్చె న్వీఁడె యాగార త
త్కులకాంతాసహితంబు రుద్రునయనకూర్మిగ్ని దగ్ధాంగుఁ డా
తతశిరుప్విల్తుఁడు తొంటికన్నఁ గనువందంబైనరూపంబుతోన్.

అందఱు — (విస్మయము నిరూపించుచున్నారు.)

హిమ —

శా. శ్రీకల్యాణగుణాన దాతఁ దనయ న్జేపట్టె విశ్వాత్ముఁ డా
శ్రీకంఠుం డు మదీయపూర్వసుకృతో త్సేకంబు నన్బొందెఁడున్

నాకశ్రేణి మనోరథంబులు స్ఫురన్నవ్యాకృతిం దాల్చుచున్
లోకానందకరుండు మన్మథుఁడు సల్పు న్వెండిఁ గన్పండుఁవున్.

శంక — ఇంకను నీకేమి కావలయును ?

హిమ — సకలమనోరథములు సిద్ధించినవారి కింకనుఁ గోఁరక యేముండును ? నిట్లగుం గాక !

భరతవాక్యము.

మ. తనరన్లోకము లన్నియుం గురియుఁగాత న్వృష్టి నిందుప్రింపు పం
డినసస్యమ్ముల భూతధాత్రి పులకాన్వీతం బగుంగాత స
జ్జనసంపత్తులు విఘ్నము ల్దొలఁగుచు న్బాగు న్జగత్ప్రీతిగా
ననయుం గీర్తిత విష్ణు సౌఖ్యములు నిత్యానందుఁ డీసుం డొగిన్.

సమాప్తము.

—:o:—

శ్రీ విద్యానిలయముద్రాక్షరశాల, రాజమహేంద్రవరము:— 1919.

శ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహముగారిచే రచియింపబడి
విక్రయింపబడు గ్రంథముల వివరము.

| | | రూ. | అ. | పై. |
|---|---|---|---|---|
| గయోపాఖ్యానము (నాటకము) | Ely. Training School Text 1916 | 0 | 10 | 0 |
| శ్రీప్రసన్నయాదవము (నాటకము) | Revised | 0 | 8 | 0 |
| పారిజాతాపహరణము (నాటకము) | డిటో | 0 | 8 | 0 |
| స్వప్నవాసవదత్త (నాటకము) | | 0 | 8 | 0 |
| మధ్యమవ్యాయోగము (నాటకము) | | 0 | 2 | 0 |
| సుధాశరచ్చంద్రము (నవల) | Dutt's Lake of Palms | 1 | 0 | 0 |
| సౌందర్యతిలక | | 1 | 0 | 0 |
| హేమలత (నవల) | Inter Text 1916 | 0 | 12 | 0 |
| అహల్యాబాయి ,, | | 0 | 12 | 0 |
| రామచంద్రవిజయము (నవల) | S. S. L. C. Text 1915 | 0 | 10 | 0 |
| మహాపురుషుల జీవితములు (మొదటిభాగము) | | 0 | 12 | 0 |
| డిటో (రెండవభాగము) | | 0 | 10 | 0 |
| డిటో (మూడవభాగము) | | 0 | 12 | 0 |
| బెంజామిన్ ఫ్రాంక్లిన్ | | 0 | 3 | 0 |
| నందచరిత్ర | | 0 | 4 | 0 |
| రాజస్థానకథావళి (మొదటిభాగము) | | 0 | 14 | 0 |
| డిటో (రెండవభాగము) | | 0 | 14 | 0 |
| భారతకథామంజరి | | 0 | 8 | 0 |
| కృష్ణవేణి | | 0 | 6 | 0 |
| మణిమంజరి (నవల) | | 0 | 6 | 0 |
| గోదావరిమండలసభ | | 0 | 1 | 0 |
| వినోదములు (రెండుభాగములు) | | 0 | 8 | 0 |
| డిటో (మూడవభాగము) | | 0 | 6 | 0 |

వలయువారు—

సన్ లైట్ బుక్కు డిపో,
రాజమండ్రి.